నోరూరించే... మనసుదోచే... మైమరపించే.






క్రొత్త పార్లే

పాపిన్స్

పండ్ల రుచిగల పిప్పరమెంట్లు

5 పండ్ల సువాసనలలో 13 మధురమైన బిళ్ళలు-
తక్కువ వెలగల మక్కువ గొలిపే ప్రతి ప్యాక్‌లో—
నిమ్మ, మూసంబి, నారింజ, అనాస మరియు రాస్ప్‌బెరీ!

ఆ పండ్ల మజా తెలుసుకోండి పాపిన్స్ నారగించండి-

everest/122/PP tel

ప్రతి గ్రంథాలయంలోను
ఉండితీరాలి!



శ్రీమతి మధురం భూతలింగం
రచించిన ఇంగ్లీషు పుస్తకాలు

**'SONS OF PANDU'**
Rs. 5-25

**'THE NECTAR OF THE GODS'**
Rs. 4-00

పిల్లలకు బహుమతిగా
ఇవ్వతగినవి.



కావలసినవారు:

**డాల్టన్ ఏజన్సీస్**
'చందమామ బిల్డింగ్స్'
మదరాసు - 26

---

# స్వాన్ పెన్నులు
## అంతరిక్ష యుగ విద్యార్థులకు







ఆధునిక తరానికి స్వాన్ పెన్నులు.
స్వాన్ మాత్రమే మెత్తగా తేలికగా
జారిపోతూ వ్రాస్తుంది. స్వాన్
ఆక్స్‌ఫోర్డ్ గాని కేంబ్రిడ్జ్ గాని
తీసుకోండి—ఆనందంగా చంద్రగోళంపై
అడుగుపెట్టండి.

శ్రేష్ఠమైన ఫలితాల కోసం
**స్వాన్**
డీలక్స్ ఇంకుతో
వ్రాయండి.






**స్వాన్** (ఇండియా) ప్రైవేట్ లిమిటెడ్
అద్వాని ఛాంబర్స్ పి. మెహతా రోడ్డు,
బొంబాయి-1
బ్రాంచి: 34బి. కన్నాట్ ప్లేస్ క్రొత్త ఢిల్లీ.




hero's SI-120 II



నేడే చూడండి
రవిచిత్ర ఫిలిమ్స్
సమర్పించు
మొనగాడొస్తున్నాడు
జాగ్రత్త
ఈస్ట్‌మన్ కలర్
నిర్మాత: వై.వి.రావ్. దర్శకత్వం: కె.వి.యస్.కుటుంబరావు
పూర్ణా రిలీజ్

# బేబీ దొంగను పట్టుకున్న























THE ANDHRA BANK LTD




KIDDY
BANK







# చందమామ

సంస్థాపకుడు: నాగిరెడ్డి
సంచాలకుడు: 'చక్రపాణి'

జీవితంలో పోరాటం ప్రధానంగా ఉన్నట్టయితే బలవంతుడు నెగ్గి, బలహీనుడు అణగారి పోతాడు. కాని జీవితంలో పరస్పర సహకారం ప్రధానమైనప్పుడు సమర్థుడు నెగ్గటమే గాక అసమర్థుడికి కూడా విజయం సాధించి పెడతాడు. అందుచేతనే జీవితంలో వికాసం ఉండాలంటే సహకారం ఎంతైనా అవసరం. ఈ నీతి "పరస్పర సహాయం" [బేతాళ కథ] లో మనకు కనిపిస్తుంది. అన్నదమ్ము లిద్దరూ పరీక్షలో ఓడి కూడా సహకారం ద్వారా ఇద్దరూ నెగ్గుతారు.

సంపుటి 50 ఫిబ్రవరి '72 సంచిక 2










కోన్ధో ? యో కార్యరతః ; కో బధిరో ?
యః శృణోతి నహితాని ;
కో మూకో ? యః కాలే ప్రియాణి
వక్తుం న జానాతి. 1

[ఎవడు గుడ్డివాడు ? చెడ్డపనులు చెయ్యటంలో ఆసక్తిగలవాడు. ఎవడు చెవిటివాడు ? హితవు మాటలు విననివాడు. ఎవడు మూగవాడు ? ప్రియవాక్యాలు పలకలేనివాడు.]

కో ధర్మో ? భూతదయా ;
కిం సౌఖ్య ? మరోగితా జగతి ;
కః స్నేహః ? సద్భావః ;
కిం పాండిత్యం ? పరిచ్ఛేదః. 2

[ఏది ధర్మం ? భూతదయ. ఏది సౌఖ్యం ? జబ్బులేకుండా ఉండటం. ఏది స్నేహం ? మంచి బుద్ధి. ఏది పాండిత్యం ? నిర్ణయం చెయ్యగలగటం.]

కృత శత మసత్సు నష్టం ;
సుభాషిత శతంచ నష్ట మబుధేషు ;
వచనశత మవచనకరే ;
బుద్ధిశత మచేతనే నష్టం. 3

[దుర్మార్గులకు నూరు సహాయాలు వ్యర్థం ; బుద్ధిహీనులకు నూరు నీతులు వ్యర్థం ; చెప్పిన మాట విననివాళ్ళకు నూరు బుద్ధులు వ్యర్థం.]

---

వివేకం

---



# మహాజ్ఞాని

పూర్వం ఒక కుగ్రామంలో ఒక మనిషి తాను గొప్ప జ్ఞానిని అని చెప్పుకుంటూ ఉండేవాడు. అందరూ ఆయన మాట నమ్మి, ఏదన్నా సలహా కావలసినప్పుడల్లా ఆయన పద్దకు పోతూ ఉండేవారు.

ఆ గ్రామంలోనే ఒక భార్యా, భర్తా ఉండేవారు. వాళ్ళు అమిత సోమరిపోతులు. రోజూ బారెడు పొద్దెక్కినాక గాని నిద్ర లేచే వారు కారు.

ఒకనాడు ఎవరో వారికి, "కోడిపుంజు అని ఒక పక్షి ఉంటుంది. దాన్ని తెచ్చుకున్నారంటే అది చీకటితోనే అరిచి, మిమ్మల్ని లేపగొట్టుతుంది. మీ పనులు మీరు సకాలంలో చేసుకోవచ్చు," అని సలహా ఇచ్చారు.

సరేనని, ఆ భార్యాభర్తలు సమీపంలో ఉన్న పట్నంలో సంతకు వెళ్ళి, అక్కడ ఉన్న పక్షులలో బాగా బలిసిన బాతును కొనుక్కొచ్చారు. ఆ రాత్రి వాళ్ళు దాన్ని తమ మంచం కింద ఉంచి, తెల్లారే లోపల అదే తమను లేపగొట్టుతుంది గదా అన్న ధైర్యంతో నిశ్చింతగా నిద్రపోయారు.

మర్నాడు వాళ్ళు లేచేసరికి మిట్ట మధ్యాన్నమయింది. మంచం కింద చూస్తే పక్షి ఉన్నది. కాని అది కూయలేదు.

"అది ఎందుకు కూయలేదో మహాజ్ఞానిని అడిగి తెలుసుకుందాం," అనుకుని వాళ్ళు తమ బాతుతో సహా జ్ఞాని వద్దకు వెళ్ళి జరిగినదంతా చెప్పారు.

జ్ఞాని ఆ బాతును తన చేతుల్లోకి తీసుకుని, పరీక్షించి, "ఇక నేం? ఎవరో దీని ముక్కు మీద కాలు వేసి తొక్కి అణచి పారేశారు. అది ఎలా కూస్తుంది మరీ?" అన్నాడు.

ఆ దంపతులు ఆయన తెలివి తేటలకు ఆశ్చర్యపడి ఇంటికి తిరిగి వచ్చారు.

ఎస్. లక్ష్మిదేవి

ఇది జరిగిన కొంత కాలానికి ఒక రోజున ఆ దంపతులు పెంచుకున్న మేక కట్టు విప్పుకుని, ఆవరణ అంతా తిరుగుతూ ఒక కుండ అడుగున కాసిని గింజలు ఉండటం చూసి, అందులో తల దూర్చింది. కాని, గింజలు తిన్నాక ఆ మేక తల బయటికి తీయబోతే కొమ్ములు అడ్డం వచ్చాయి. తలకు ఆ కుండను తొడుక్కుని మేక వెర్రిగా అటూ ఇటూ పరిగెత్తుతూ ఉంటే దంపతులు చూశారు. ఒకరు కుండనూ, మరొకరు మేకతోకనూ పట్టుకుని లాగారు, కాని ప్రయోజనం లేకపోయింది.

ఇలా కాదని వాళ్ళు జ్ఞానికి కబురు పెట్టారు. జ్ఞాని వచ్చి, మేకను చూసి, చాలా సేపు గంభీరంగా ఆలోచించి, "మేకనూ, కుండనూ వేరు చేయాలంటే మేక తల నరికెయ్యాలి!" అన్నాడు.

"ఎంత తెలివైన ఆలోచన!" అని భార్యా భర్తలిద్దరూ మెచ్చుకున్నారు.

వాళ్ళు వేటకత్తి తెచ్చి, మేక మెడ నరికేశారు. మేకా, కుండా వేరై పోయాయి.

"కాని, బాబుగారూ, కుండలో మేక తల ఉండి పోయిందే!" అన్నారు వాళ్ళు.

"దాని దేముంది? కుండ పగలగొట్టితే సరిపోయె!" అన్నాడు జ్ఞాని.

అదీ గొప్ప ఆలోచనే అయింది. కుండను ఎత్తి పడేసేసరికి అది నూరు ముక్కలయి, మేకతల బయటపడింది.

"మీరు మాకు ఇవాళ ఎంత ఉపకారం చేశారో చెప్పలేం. మీరీ పూట మా యింట భోజనం చేయాలి," అన్నారు దంపతులు.

జ్ఞాని అలాగేనన్నాడు. ఆయన భోజనం చేస్తూ మధ్యలో తల ఎత్తి చూసి, విచారంగా నిట్టూర్చి, "హుఀ!" అన్నాడు.

"ఏమిటి, బాబూ? ఏం జరిగింది?" అని దంపతులు ఆదుర్దాగా అడిగారు.

"నేను పోయాక మీ వంటి అమాయకుల గతి ఏమిటా అని ఆలోచిస్తున్నాను!" అన్నాడు జ్ఞాని.

అయితే ఆయన అనవసరంగా బాధపడ్డాడు. అలాటి జ్ఞానులు ప్రపంచంలో ఉంటూనే వస్తున్నారు.





# బంగారుబాతుగుడ్లు

ఒక నగరంలో రాముడు అనే పేద యువకుడు ఉండేవాడు. వాడికి నా అన్న వారెవరూ లేరు. వాడికి ఉన్నదల్లా ఒక కొంపా, ఒక కోడిపెట్టా. రాముడు పగలల్లా నగరంలో కూలి పనులు చేసి, ఆ డబ్బుతో తన పొట్ట నింపుకునేవాడు. ఒక్కరోజు సంపాదన దొరక్కపోతే తన కోడి పెట్టిన గుడ్లు ఉడకేసుకు తిని, మంచినీళ్ళు తాగి, తృప్తిగా పడుకునేవాడు.

రాముడి ఇంటి పొరుగున గవరయ్య అనే వాడు ఉండేవాడు. గవరయ్య దురాశాపరుడే గాక, ఒకరు పచ్చగా ఉంటే చూసి ఓర్చలేనివాడు. రాముడు చిల్లిగవ్వ చెయ్యక పోయినా, ఉన్నది తిని నిశ్చితంగా తిరుగుతూ ఉండటం గవరయ్యకు కడుపు మంటగా ఉండేది. బలిసి, కొవ్వుపట్టి ఉన్న రాముడి కోడిపెట్టను చూసి కూడా గవరయ్య అసూయపడేవాడు.

ఒకనాడు రాముడు ఇంటిలో లేని సమయంలో గవరయ్య ఆ కోడిని పట్టి, కోసి, వండుకుని ఆరగించేశాడు. రాముడు ఇంటికి వచ్చి చూసేసరికి కోడిపెట్ట లేదు. దాని ఈకలు అవీ పొరుగు వాడి ఆవరణలో కనిపించాయి.

రాముడు గవరయ్య వద్దకు వెళ్ళి, ''నా కోడిని ఏమి చేశావు?'' అని అడిగాడు.

''మా పిల్లి ఎక్కడి నుంచో ఒక కోడిని తెచ్చి, తినబోయింది. నేను ఆ కోడిని కాపాడదామనుకున్నాను. ఆ కోడి చావనే చచ్చింది. ఇక చేసేది లేక వండుకు తిన్నాను. ఆ కోడి నీదేనని నాకేం తెలుసు?'' అన్నాడు గవరయ్య.

రాముడు మండిపడి, ''మర్యాదగా నా కోడిని నాకిస్తావా? రాజుగారి దగ్గిర ఫిర్యాదు చెయ్యమన్నావా?'' అని గవరయ్యను అడిగాడు.

జి. నిర్మల




గవరయ్య భయపడ్డాడు. ఎందుకంటే, రాజు న్యాయం చెయ్యటంలో దయాదాక్షిణ్యాలు చూపేవాడు కాడు. గవరయ్యకు జరిమానాగాని, ఖైదు శిక్షగాని పడి తీరుతుంది. ఏదో విధంగా రాముడితో రాజీ పడటమే మంచిదని గవరయ్య, రాముడికి ఒక బాతుపిల్లను ఇస్తూ, "నీ కోడికి బదులుగా దీన్ని పట్టుకుపో," అన్నాడు.

బంగారం లాంటి కోడి పోయినా, బాతు పిల్ల అయినా దొరికినందుకు రాముడు ఊరటపడ్డాడు.

కొంత కాలానికి బాతుపిల్ల పెరిగి గుడ్లు పెట్టసాగింది. ఇంతలో వర్షాకాలం వచ్చింది. ఒకనాటి రాత్రి వర్షం జోరున కురుస్తూండగా ఒక ఫకీరు వచ్చి, గవరయ్య ఇంటి తలుపు తట్టాడు.

"ఎవరదీ? వేళాపాళా లేదూ? ఈ వర్షంలో నీకు తలుపెవరు తీస్తారు? వెళ్ళు, వెళ్ళు," అని ఫకీరుతో అని, గవరయ్య ముసుగుతన్ని పడుకున్నాడు.

ఫకీరు వచ్చి రాముడి ఇంటి తలుపు తట్టాడు. రాముడు తలుపు తెరిచి, తడిసి పోయి చలికి వణుకుతున్న ఫకీరును చూసి, లోపలికి రమ్మని, అతడికి పొడి బట్టలిచ్చి, చలి కాచుకోవటానికి చితుకుల మంట వేశాడు. ఆ మంట మీదనే రెండు బాతుగుడ్లు ఉడకబెట్టి, రాముడు ఫకీరుకు తినమని ఇచ్చాడు.

"బాతుగుడ్లు చాలా రుచిగా ఉన్నాయి, నాయనా! ఏదీ నీ బాతు?" అని ఫకీరు రాముణ్ణి అడిగాడు. రాముడు గంప కింది నుంచి బాతును తెచ్చి ఫకీరుకు చూపాడు.

"దేవుడు నీకు మేలుచేస్తాడు, నాయనా!" అంటూ ఫకీరు బాతును నిమిరి, వర్షం తగ్గిపోవటం చేత, ఆ చీకట్లోనే వెళ్ళిపోయాడు.

ఆ మర్నాటి నుంచీ ఆ బాతు మామూలు గుడ్లకు బదులు బంగారు గుడ్లు పెట్టసాగింది. దానితో రాముడి దరిద్రం తీరిపోయింది. వాడు కూలికి వెళ్ళటం మానుకుని, బాతుపెట్టే బంగారంతో తాను తిని, మిగిలినది దానధర్మాలు చేయసాగాడు.

కాని వాడా పూరికొంపను మాత్రం విడిచి పెట్టలేదు.

గవరయ్యకు రాముడి జీవితంలో ఏదో మార్పు కలిగినట్టు తెలిసింది, కాని అది ఎలా కలిగినదీ తెలియలేదు. అతను రాముడి మీద ఒక కన్నువేసి ఉంచాడు.

ఒకరోజు రాముడు బాతు ఉండే గంప కింది నుంచి ఒక బంగారు గుడ్డు తియ్యటం గవరయ్య కంటపడింది. వెంటనే గవరయ్య గుండె అసూయతో అవిసిపోయింది. అది తన బాతే అయి ఉండటంచేత గవరయ్య కడుపుమంట మరింత అయింది.

"నా బాతును నాకిచ్చెయ్యి." అంటే రాముడు ఇవ్వడు. అందుచేత, గవరయ్య తన నౌకర్లను ఇద్దరిని వెంటబెట్టుకుని రాజు గారి దర్బారుకు వెళ్ళి, ఆయన న్యాయ విచారణ జరిపే సమయంలో, "మహా రాజా, నా పొరుగున ఉన్న రాము డనేవాడు నా బాతులను చాలా కాలంగా కాజేస్తు న్నాడు. అవి ఒకటొకటే పోతుంటే ఏ గండు పిల్లో కాజేస్తున్నదనుకున్నాను. కాని నిన్న రాత్రి రాముడు నా బాతును కాజేస్తూ ఉండగా ఈ మనుషు లిద్దరూ చూశారు. ఏలినవారు నా బాతును నాకు తిరిగి ఇప్పిం చాలి," అన్నాడు.

రాజుగారు తన భటులను పంపి, రాముణ్ణి బాతుతో సహా దర్బారుకు పిలిపించాడు.




"నువు నిన్నరాత్రి ఇతని బాతును దొంగిలించావట, నిజమేనా?" అని రాజు రాముణ్ణి అడిగాడు.

గవరయ్యకు బాతు రహస్యం తెలిసి పోయిందని రాముడికి అర్థమయింది.

"మహారాజా, నేను దొంగతనం చెయ్య లేదు. ఇది ఇతని బాతే, కాని కొంతకాలం క్రితం నా కోడిని కాజేసి, చంపి తిని, దానికి బదులుగా నాకీ బాతును ఇచ్చాడు," అన్నాడు రాముడు.

"అబద్ధం! నిన్న ఈ మనిషి దొంగతనం చేస్తూండగా చూసిన ఈ ఇద్దరు సాక్షులూ ఉన్నారు. వాడు చెప్పేదానికి సాక్షులెవరు?" అన్నాడు గవరయ్య.

రాజుగారు, "ఈ బాతును ప్రస్తుతానికి నావద్ద ఉంచి, రేపు మీరిద్దరూ రండి, తీర్పు చెబుతాను," అని గవరయ్యనూ, రాముణ్ణీ పంపేశాడు.

ఆ రోజు కూడా ఆ బాతు రాజుగారి దగ్గిర బంగారు గుడ్డు పెట్టింది. రాజుగారు తన కళ్ళను తానే నమ్మలేకపోయాడు. ఈ రహస్యం ఫిర్యాదీలకు తెలిసే ఉండాలి. వారినుంచే నిజం రాబట్ట దలిచాడు రాజు.

మర్నాడు దర్బారుకు గవరయ్యా, రాముడూ వచ్చారు.

రాజుగారు గవరయ్యకు ఒక మామూలు బాతుగుడ్డు చూపుతూ, "నీ బాతు ఈ ప్రమాణం గల గుడ్లు పెడుతుందా?" అని అడిగాడు.

"ఇంతకన్న ఇంకాస్త పెద్ద గుడ్లే పెడుతుంది, మహారాజా!" అన్నాడు గవరయ్య.

రాజు అదే ప్రశ్న రాముణ్ణి అడిగాడు.

"అది మామూలు గుడ్లు పెట్టదు, మహారాజా. నా బాతు రోజుకొక బంగారు గుడ్డు పెడుతుంది," అన్నాడు రాముడు.

గవరయ్య తెలివిగా, "ఎంత అబద్ధం! బాతు ఎక్కడన్నా బంగారు గుడ్లు పెడుతుందా?" అన్నాడు.

"నీ మాట నిజం! అది నీ బాతే. దాన్ని నువు తీసుకువెళ్ళు," అని రాజు గవరయ్యకు మామూలు బాతు నొకదాన్ని ఇచ్చి పంపేశాడు.

తనకు న్యాయం జరగనందుకు విచారిస్తూ నిలబడిన రాముడితో రాజు, "దిగులు పడకు. నీ బాతు నా వద్దనే ఉన్నది. అది బంగారు గుడ్లు పెట్టటానికి కారణం ఏమిటి?" అన్నాడు.

రాముడు ఫకీరు సంగతి అంతా రాజుకు చెప్పాడు. రాజు ఆశ్చర్యపడి, రాముణ్ణి బాతుతో సహా తన దివాణంలోనే ఉండిపొమ్మన్నాడు.

గవరయ్య తీసుకుపోయిన బాతు మామూలు గుడ్లే పెట్టింది. రాముడికి దివాణంలో ఉద్యోగమయిందని తెలియగానే, తనకు తగిన శాస్తి జరిగిందనుకున్నాడు గవరయ్య.






# రాతిరథం

## 17

[రాజు నిత్యానందుడు తన నగరానికి పారిపోగానే, విఘ్నేశ్వరపూజారి ఆటవికమూకను వెంటబెట్టుకుని నగరం మీదికి వచ్చాడు. నగరద్వారాన్ని అతడు బద్దలుకొట్టే సమయంలో, ఖడ్గ జీవదత్తులు రాజుకూ, అతడి మంత్రికి ఒక సలహా యిచ్చారు. మంత్రి నగరద్వారాన్ని తెరిపించాడు. పూజారి ఉద్యానవనం కేసి బయలుదేరాడు. తరవాత—]

ఉద్యానవనమార్గానికి రెండు వైపులా ఎత్తయిన వృక్షాలున్నవి. వాటి కొమ్మలు ఒకదానికొకటి పెనవేసుకుపోయినై. పూజారి ఆ దారి వెంట కొంతదూరం వెళ్ళేసరికి చెట్ల మీది నుంచి ఎవరో, "విఘ్నేశ్వర పూజారి పైన పన్నీరు వర్షం కురిపించండి!" అని కేకపెట్టాడు.

ఆ వెంటనే చెట్ల మీది నుంచి పూజారి పైన కర్పూరతైలం జల్లులా పడింది.

పూజారి ఉగ్రుడైపోయి, "ఎవర్రా చెట్టు కొమ్మల్లో? ఈ అవమానానికి మిమ్మల్ని చిత్రవధ చేయిస్తాను!" అంటూ అరిచాడు.

"స్నానం పూర్తయినట్టుంది! మండుతున్న గుడ్డముక్కలు మీదికి విసరండి!" అంటూ, యీసారి మరొక కంఠం కేక పెట్టింది.

మరుక్షణంలో చెట్లకొమ్మల్లో నుంచి భగ భగ మండుతున్న గుడ్డముక్కలు విఘ్నే



శ్వర పూజారి ఎక్కి వున్న రాకాసి ఏనుగు మీద పడసాగినై. చూస్తూండగానే తైలంలో బాగా తడిసి వున్న ఏనుగు మీథ అక్కడక్కడా పెద్ద మంటలు లేచినై. పూజారి తలమీద కూడా చిన్న మంటలేచింది.

"ఇది మోసం! కానున్న రాజుకు ద్రోహం!" అంటూ పూజారి ఏనుగు మీద నిలబడి తల మీద మండుతున్న కిరీటాన్ని తీసి దూరంగా పారవేశాడు. అదే సమయంలో ఏనుగు శరీరం లోంచి చాలా కంఠాలు గందరగోళంగా అరవసాగినై. దాని నాలుగు కాళ్ళూ నాలుగు వైపులకు పరిగెత్తే ప్రయత్నం చేస్తున్నట్టు, అది అడ్డదిడ్డంగా అడుగులు వేయసాగింది.

పై నుంచి యింకా దాని మీద మండుతున్న గుడ్డముక్కలు వచ్చి పడుతూనే వున్నాయి.

"ఖడ్గా, మనం ఊహించినట్టే యిది నిజమైన ఏనుగు కాదు! ఎవడో తెలివైన దొంగవెధవ, ఏనుగు ఆకారాన్ని తయారు చేసి, అందులో తన మనుషుల్ని పెట్టి నడిపిస్తూ, రాజు నిత్యానందుణ్ణి హడల కొట్టాడు," అన్నాడు జీవదత్తుడు.

"అదుగో, ఒక్కొక్క ఆటవికుడూ ఏనుగు పొట్టలోంచీ, కాళ్ళల్లోంచీ బయిటికి వస్తున్నారు. ఏనుగు పక్కకు కూలి పోతున్నది! మంటల్లో చిక్కుకుని పూజారి గాడు చావకముందే, వాణ్ణి పైకి లాగాలి!" అంటూ ఖడ్గవర్మ చెట్టు కొమ్మల్లోంచి ఒక ఉచ్చుతాడు విసిరి, పూజారి నడుముకు బిగించి, పైకి గుంజాడు. పూజారి గాలిలో కాళ్ళూ, చేతులూ అల్లల్లాడిస్తూ, "అయ్యో, రక్షించండి! నా శరీరం కాలిపోతున్నది!" అంటూ అరవసాగాడు.

ఈ లోపల పెద్దగా మండుతూ ఏనుగు కింద పడిపోయింది. దాని శరీరం లోంచి అనేకమంది ఆటవికులు గగ్గోలుగా అరుస్తూ బయిటికి రాసాగారు. అలా వచ్చిన వాళ్ళందరినీ, సమయానికి అక్కడికి వచ్చిన సేనా నాయకుడు తన సైనికుల చేత ఒక చోట మంద వేయించసాగాడు. ఖడ్గవర్మ పూజారిని చెట్టు పై నుంచి కిందికి జార్చాడు.

పూజారి తన శరీరాన్ని చుట్టుముట్టిన మంటల్ని ఆర్పుకునేందుకు నేల మీద అటూ యిటూ దొర్లటం ప్రారంభించాడు.

చెట్టు దిగి వచ్చిన ఖడ్గ జీవదత్తులు, పూజారి మీద ఇంత దుమ్ముకొట్టి మంటలు ఆర్పి, అతణ్ణి మెడ పట్టుకుని లేపి నిల బెట్టారు. ఖడ్గవర్మ కసిగా పళ్ళు కొరికి కత్తి దూసి, పూజారి కంఠానికి గురి చేసి, "దుర్మార్గుడా! మా దారికి అడ్డు తగిలి, మమ్మల్ని మోసంతో బంధించినందుకు యిదుగో, నీ తల యిప్పుడే నరకబోతు న్నాను," అన్నాడు.

విఘ్నేశ్వరపూజారి వణికిపోతూ, "మహా ప్రభో, నా తల నరక్కు! నేను నమ్మిన స్వామే నాకు కలలో కనిపించి, నాలో రాజ్య కాంక్ష రేపాడు. కాని, ఈ మాయ ఏనుగు తంత్రం పన్నిన వాణ్ణి నేను కాదు, అదంతా స్వర్ణాచారిది!" అన్నాడు.

జీవదత్తుడు, ఖడ్గవర్మ చేయి పట్టుకుని ఆపి, పూజారిని, "ఆ స్వర్ణాచారి ఎక్కడ?" అని ప్రశ్నించాడు.

పూజారి బాధతో పెద్దగా మూలిగి, "వాడు మాయ ఏనుగు కుంభస్థలంలో వుంటాడు. అక్కడ వుండి ఏనుగులో వాడు అమర్చిన మరల్నీ, గిలకల్నీ ఆటవికుల చేత తిప్పి స్తుంటాడు. వా డింకా బయిటికి రాలేదా?" అన్నాడు కాలిపోతున్న ఏనుగు కేసి చూస్తూ.




పూజారి యిలా అనగానే జీవదత్తుడు గబగబా పోయి, కాలుతున్న ఏనుగు తల మీద సైనికుల చేత నీళ్ళు పోయించి, మంటలు తగ్గిపోగానే, దాని తొండం పట్టు కుని పైకి ఎత్తించాడు. వెంటనే లోపలి నుంచి ఒక మనిషి రాయిలా దభీమంటూ కింద పడ్డాడు. వాడిలో స్పృహ లేదు.

"వాడే స్వర్ణాచారి! విఘ్నేశ్వరస్వామీ, వీడూ కలిసి నా ప్రాణం మీదికి తెచ్చారు!" అన్నాడు పూజారి.

"నీ దురాశే నిన్ను యిన్ని చిక్కుల్లో పెట్టింది; ఇతరుల్ని నిందించకు!" అని జీవదత్తుడు పూజారిని గట్టిగా కోప్పడి, స్వర్ణా చారి ముఖాన నీళ్ళు చల్లించాడు.



కొద్ది సేపటికల్లా స్వర్ణాచారి కళ్ళు తెరిచి చుట్టూ కలయ చూస్తూ, "నే నెక్కడున్నాను? పూజారి రాజయాడా?" అని అడిగాడు.

"వాడు రాజూ కాలేదు, నువ్వు మంత్రివీ కాలేదు. మీ ఇద్దరూ ఒళ్ళు కాల్చుకుని అఘోరిస్తున్నారు. కొద్ది సేపట్లో నిత్యానంద రాజు యిక్కడికి వచ్చి మిమ్మల్ని చిత్రవధ చేయిస్తాడు!" అన్నాడు ఖడ్గవర్మ కసిగా.

ఖడ్గవర్మ మాటలు వింటూనే స్వర్ణాచారి లేచి కూర్చుని, తల తిప్పి దూరంగా నిలబడి వున్న విఘ్నేశ్వర పూజారిని చూసి, "ఐరావతాన్ని నగరంలోకి తీసుకు పోవద్దు, రహస్యం బయట పడిపోతుందని నెత్తీ నోరూ కొట్టుకుని చెప్పినా, నువ్వు నా మాట విన్నావు కావు. ఇప్పుడు మనిద్దరికీ చావు తప్పదు!" అన్నాడు ఏడ్పుముఖం పెట్టి.

"ఒట్టి చావు కాదు; చిత్రవధ చేయించి మరీ మిమ్మల్ని చంపిస్తాను!" అంటూ రాజు నిత్యానందుడు ఒక పొదరింటి చాటు నుంచి బయిటికి వచ్చి, ఖడ్గ జీవదత్తులతో, "మహా శూరులారా! మీ శక్తి సామర్థ్యాలతో నన్నూ, నా రాజ్యాన్నీ, యీ దుర్మార్గుల నుంచి కాపాడారు. మీకేం కావాలో కోరండి, యిస్తాను!" అన్నాడు.

"మీ నుంచి మేము ఎలాంటి బహూకృతీ ఆశించటం లేదు. పెద్ద బెడద తప్పింది కనక, యిక సుఖంగా రాజ్యం ఏలుకోండి. వీళ్ళిద్దర్నీ, వీళ్ళ అనుచరులైన ఆటవికుల్నీ తీసుకుని మా దారిన మేం పోతాం," అన్నాడు జీవదత్తుడు.

"వీళ్ళనూ, ఆటవికుల్నీ ప్రాణాలతో వదలటమా? ఆటవికుల్ని ఆవరణలో బంధించి, పైనున్న గోడల మీంచి వాళ్ళ మీద కర్పూరతైలం పోయించి, వాళ్ళు బాగా తడిసిం తరవాత, అందరి మీదా మండుతున్న గుడ్డలు వేయించి నిలువునా దహించబోతున్నాను. మీరు యీ మాయ ఏనుగు మీద ప్రయోగించిన అస్త్రాన్నే, నేను వాళ్ళ మీద ప్రయోగిస్తాను," అన్నాడు నిత్యానందుడు.

"మహారాజా! ఎంతటి శత్రువునైనా అంత క్రూరంగా చంపటం న్యాయం అని పించుకోదు. జరిగిందేదో జరిగిపోయింది—ఇప్పుడు యీ పూజారినీ, స్వర్ణాచారినీ, ఆట వికుల్నీ మీ రాజ్యసరిహద్దులు దాటించి, ముందు ముందు మీ కెలాంటి ప్రమాదం రాకుండా చేస్తాం," అంటూ జీవదత్తుడు స్వర్ణాచారిని రెండు చేతులూ పట్టుకుని నిల బెట్టి, పూజారితో, "విఘ్నేశ్వరపూజారీ, అలా గజగజ వణికిపోకు! మా వెంటరా. ముందు నీ అనుచరులైన ఆటవికుల్ని కాపా డాలి," అంటూ బయలుదేరాడు.

"మహాశూరుడా! మా ఆజ్ఞ..." అంటూ నిత్యానందుడు ఏమో చెప్పబోయేంతలో ఖడ్గవర్మ చర్రున కత్తి దూసి, "శూరుడూ, వీరుడూ అంటూ వెకిలిగా మాట్లాడకు! ఇక్కడ ఆజ్ఞ లిచ్చేది నువ్వు కాదు, జీవ దత్తుడు! తెలిసిందా?" అన్నాడు.

రాజు కోపంతో నిలువెల్లా కంపించి పోయాడు. అతడు పెద్దగా గొంతెత్తి, "నా రాజ్యంలో....నా భవన ప్రాంగ ణంలో .... నా ఎదుట..." అంటూ ప్రారం భించేసరికి, మంత్రి అతణ్ణి సమీపించి చిన్నగా ఏదో చెప్పాడు. రాజు కొంచెం శాంతపడి, అక్కణ్ణించి వెళ్ళిపోతున్న ఖడ్గ జీవదత్తుల్నీ, తన ఇద్దరు శత్రువుల్నీ చూస్తూ పళ్ళు కొరకసాగాడు.



ఖడ్గ జీవదత్తులు, ఆటవికులు బంధింప బడి వున్న ప్రదేశం చేరేసరికి, కొందరు సైనికులు గోడల పై భాగాన చేరి, దిగువ నున్న ఆటవికుల మీద కుండలతో కర్పూర తైలం గుమ్మరిస్తున్నారు. అది చూస్తూనే ఖడ్గ జీవదత్తులు, "ఆగండి! ఆగండి!" అంటూ కేకలు పెట్టారు.

"ఈ అడివి మనుషుల్ని సజీవంగా కాల్చి చంపమని సేనాని ఆజ్ఞ!" అంటూ సైని కులు జవాబిచ్చారు.

ఖడ్గ జీవదత్తులు పరుగు పరుగున గోడను సమీపించి అక్కడ వున్న మెట్ల మీదుగా పైకి పోయారు. సైనికులు కేరింతలు కొడుతూ ఆటవికుల మీద కర్పూరతైలం




పోస్తున్నారు. ఆటవికులు భయకంపితులై పోయి హాహాకారాలు చేస్తూ, మూసి వున్న ద్వారాన్ని పగల కొట్టేందుకు వ్యర్థ ప్రయత్నాలు చేస్తున్నారు.

"మా అజ్ఞ ఏమిటో మీరు విన్నట్టు లేదు!" అంటూ ఖడ్గ జీవదత్తులు సైనికులలో అందిన వాళ్ళను అందినట్టుగా కాళ్ళతో తన్నీ, చేతులతో ఎత్తీ, గోడల మీంచి కింద అగాధంలో వున్న ఆటవికుల మధ్యకు నెట్టసాగారు. తమ మీద వచ్చి పడుతున్న సైనికులనూ, వాళ్ళను తన్ని పడదోస్తున్న ఖడ్గ జీవదత్తులనూ చూడగానే, ఆటవికులకు పోయిన ప్రాణాలు తిరిగి వచ్చినట్టయింది.

"అయ్యా, మమ్మల్ని యీ రాజభటుల నుంచి రక్షించి, తలుపులు తెరిపించండి! మా దారిన మేము అరణ్యానికి పోతాం. బతికి వుండగా తిరిగి యిటు కేసి చూడనైనా చూడం!" అంటూ ఆటవికులు చేతులెత్తి ఖడ్గ జీవదత్తులకు దణ్ణాలు పెట్టసాగారు.

కొద్దిసేపటికల్లా సైనికుల్లో ఆటవికుల మధ్య పడినవాళ్ళు పడగా, మిగతావాళ్ళు అక్కణ్ణించి పారిపోయారు. ఖడ్గ జీవదత్తులు పై నుంచి దిగి, ఆవరణ ద్వారం దగ్గిరకు వచ్చారు. ద్వారాన్ని కాపలా కాస్తున్న ఇద్దరు సైనికులు వాళ్ళను చూస్తూనే, "సేనాని అజ్ఞ..." అంటూ ఏమో చెప్పబోయేంతలో, జీవదత్తుడు దండంతో ఆ యిద్దర్నీ గట్టిగా మోదాడు. సైనికులు భయకంపితులైపోయి పక్కకు తప్పుకున్నారు. ఖడ్గవర్మ కత్తితో తలుపులను బంధించి వున్న తాళ్ళను నరికి, తలుపులను బార్లా తెరిచాడు. బిలబిలమంటూ ఆటవికులు బయటికి వచ్చారు. వాళ్ళల్లో కొందరు ఖడ్గ జీవదత్తులకు సాష్టాంగపడ్డారు.

"మీ కొచ్చిన ప్రాణభయం ఏమీ లేదు. మీరు హాయిగా తిరిగి మీ అరణ్యప్రాంతాలకు వెళ్ళండి. కాని యిక ఎన్నడూ, విఘ్నేశ్వరపూజారి లాంటి దుర్మార్గుల వలలో పడి చిక్కుల పాలవకండి," అని హితం చెప్పాడు జీవదత్తుడు.

"అయ్యా, ఆ పూజారీ, ఆచారీ ఎక్కడ? వాళ్ళు నమ్మబలికి మాకు చాలా ద్రోహం చేశారు. వాళ్ళను మా కాళీమాతకు బలి యిస్తాం!" అన్నాడొక ఆటవికుడు.

ఖడ్గ జీవదత్తులు, పూజారి ఎక్కడున్నాడా అని చుట్టూ కలియచూశారు. వాళ్ళకు పూజారీ, స్వర్ణాచారీ దూరంగా ఒక చెట్టు కింద నిలబడి మాట్లాడుకుంటూ కనిపించారు. వాళ్ళకు కొంచెం ఎడంగా నిత్యానందరాజూ, మంత్రీ, సేనానాయకుడూ మరొక చెట్టు కింద నిలబడి, ఏవో మంతనాలాడుతున్నారు. వాళ్ళకు వెనగ్గా సైనికులు బారులు తీరి నిలబడి వున్నారు.

"ఖడ్గా! ఈ రాజు వాలకం చూస్తుంటే, ఆటవికుల్నీ, పూజారీ, స్వర్ణాచార్లను యిక్కడే చంపించే పథకం ఏదో ఆలోచిస్తున్నాడని అనుమానం కలుగుతున్నది," అన్నాడు జీవదత్తుడు.

"ఆ దుర్మార్గు లిద్దరి సంగతేమోగాని, ఆటవికుల్ని మాత్రం క్షేమంగా వాళ్ళ అరణ్యప్రాంతం చేర్చే బాధ్యత మనమీద వున్నది. వాళ్ళను తమ కపటనాటకంలో తోలుబొమ్మల్లా పూజారీ, స్వర్ణాచారీ వాడుకున్నారు," అన్నాడు ఖడ్గవర్మ.

జీవదత్తుడు ఏదో జవాబివ్వబోయేంతలో రాజు నిత్యానందుడు హడావిడిగా సైనికుల దగ్గిరకు వెళ్ళాడు. సేనాని రాజు వెనగ్గా పోయి చేతులు నలుపుకుంటూ నిలబడ్డాడు. మంత్రి మాత్రం వున్నచోటునే నిలబడి, సైనికుల కేసీ, ఖడ్గ జీవదత్తుల కేసీ మాటిమాటికీ తల తిప్పి చూస్తున్నాడు.

"ఖడ్గా, ప్రమాదం! రాజు తన సైనికులను ఆటవికుల మీదికి ఉసికొల్పుతున్నాడు; అందులో సందేహం లేదు!" అని జీవదత్తుడు ఆటవికులతో, "మీరందరూ ఆయుధాలతో సిద్ధంగా వుండండి. మీ నాయకుడెవరు?" అని అడిగాడు.

ఆటవికుల్లో నుంచి ఒక అజానుబాహుడైన వ్యక్తి ముందుకు వచ్చి, ఖడ్గ జీవదత్తులకు తలవంచి నమస్కరించి, "అయ్యా, నేనే వీళ్ళ నాయకుణ్ణి!" అన్నాడు.

—(ఇంకావుంది)






# పరస్పర సహాయం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటి లాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, అలవిగాని పనులను సాధించాలంటే ఎంతటి సమర్థుడికైనా ఇతరుల సహాయం కావాలి. రాముడు అవతార పురుషుడే అయినప్పటికీ, వానరసేన సహాయం ఉండటం చేతనే గదా రావణ సంహారం చేసి, సీతను తెచ్చుకో గలిగాడు? నువు నీ స్వశక్తి పైనే ఆధార పడటం చేత కార్యసాధన చేసుకోలేకుండా ఉన్నావు. స్వశక్తితో పని సాధించలేక పరస్పర సహకారంతో దేవగుప్తుడి కొడుకులు తమ తలకు మించిన కార్యాన్ని ఎలా సాధించినదీ చెబుతాను, శ్రమ తెలియకుండా విను," అంటూ ఇలా చెప్ప సాగాడు:

## బేతాళ కథలు



కృష్ణాతీరాన ధాన్యకటకంలో విష్ణుగుప్తుడు అనే కోటీశ్వరు డుండేవాడు. ఆయనకు కమలాక్షి అనే కూతురు ఉండేది. యుక్తవయసు వచ్చాక ఆమెకు చాలా సంబంధాలు వచ్చాయి. కొన్ని సంబంధాలు కోటీశ్వరులవే. కాని వారు దూర ప్రాంతాల వాళ్ళు. తన ఒక్క కుమార్తెను దూరం చేసుకోవటం ఏ మాత్రం ఇష్టం లేక విష్ణుగుప్తుడు ఆ సంబంధాలను తిరగగొట్టేశాడు.

ధాన్యకటకంలోనే కొందరు వైశ్యయువకులు కమలాక్షిని పెళ్ళాడగోరారు, కాని వారిలో ఒకడూ విష్ణుగుప్తుడికి నచ్చలేదు. కొందరికి డబ్బు లేదు, మరి కొందరికి రూపం లేదు. ఇంకా కొందరికి వంశ ప్రతిష్ఠ లేదు.

ధాన్యకటకంలోనే దేవగుప్తు డనే వైశ్యోత్తము డుండేవాడు. ఆయనది విష్ణుగుప్తుడి వంశం కన్న కూడా ప్రతిష్ఠ కలది. ఒకప్పుడు దేవగుప్తుడి తండ్రి తాతలు కోటీశ్వరులే. కాని దేవగుప్తుడి తండ్రి బౌద్ధమతం పుచ్చుకుని, దాదాపు తన కున్నదంతా బౌద్ధమత వ్యాప్తికీ, భిక్షువులకూ ధారపోసి, సాధారణ కుటుంబీకుడి స్థాయికి దిగజారాడు.

దేవగుప్తుడు చిన్న చిన్న వ్యాపారాలు చేసుకుంటూ తన సంసారాన్ని నెట్టుకొస్తున్నాడు. అతనికి ఇద్దరు కొడుకులున్నారు. దానగుప్తుడు అనేవాడు పెద్దవాడు. ధనగుప్తుడు చిన్నవాడు. అయితే వారిద్దరి మధ్యా ఒక ఏడాది మాత్రమే తేడా. ఇద్దరూ చూడచక్కని యువకులు. కవలపిల్లలలాగా కనిపిస్తూ, అస్తమానమూ కలిసి తిరిగేవారు.

ఆ కుర్రవాళ్ళిద్దరికీ ఒకే ఆలోచన వచ్చింది—కమలాక్షిని పెళ్ళాడి, విష్ణుగుప్తుడి అండన తిరిగి కోటికి పడగ ఎత్తాలని. వాళ్ళు తమ ఆలోచనను తండ్రికి చెప్పారు.

"మీది గొంతెమ్మ కోరిక లాగా కనబడుతుంది. మన కన్న సంపన్నుల సంబంధాలనే విష్ణుగుప్తుడు తోసిపుచ్చాడు. అయినా ప్రయత్నించటం చేత వచ్చే నష్టమేమీ లేదు. మీ రిద్దరూ విష్ణుగుప్తుడి ఇంటికి వెళ్ళి,

మీ ఇద్దరిలో ఏ ఒకరికైనా ఆయన తన కుమార్తె నిచ్చి చేస్తాడేమో అడగండి," అన్నాడు దేవగుప్తుడు.

అన్నదమ్ములిద్దరూ విష్ణుగుప్తుడి ఇంటికి వెళ్ళి, ఆయనను కుశలప్రశ్నలు చేసి, తాము వచ్చిన పని చెప్పారు.

వారిలో ఏ ఒకడినీ తన అల్లుడు చేసు కోవటం విష్ణుగుప్తుడికి ఇష్టం లేదు. కాని ఆ మాట సూటిగా అనటానికి విష్ణుగుప్తుడికి నోరు రాలేదు. ఎందుచేతనంటే, దేవగుప్తుడు ఎంతో గౌరవించదగినవాడు. వారి వంశం సుప్రసిద్ధమైనది. అంతేగాక దానగుప్తుడూ, ధనగుప్తుడూ చక్కని యువకులూ, బుద్ధి మంతులూనూ. వారికున్న లోటల్లా గొప్ప ధనికుడి బిడ్డలు కాకపోవటం.

అందుచేత విష్ణుగుప్తుడు వారితో, "నాయనలారా, నేను నా కుమార్తెను ధని కుడికే ఇస్తానని ప్రతిజ్ఞ చేసి, ధనికులు కాని వారి సంబంధాలు చాలా తిరగగొట్టాను. ఇప్పుడు నేను మీలో ఒకరికి నా కూతురు నిచ్చి పెళ్ళి చేస్తే అన్న మాట నిలబెట్టుకో లేని వాణ్ణిగా చులకన అవుతాను. అదే గాక, నా వ్యాపారమంతా నా అనంతరం నా అల్లుడే నిర్వహించాలి. అందువల్ల నేను నాకు కాబోయే అల్లుడి వ్యాపార దక్షతను కూడా పాటించాలి," అని డొంకతిరుగు డుగా చెప్పాడు.

కుర్రవాళ్ళు అంతటితో వెనక్కు తిరిగి రాక, "పెట్టుబడి ఉన్నప్పుడే గదా వ్యాపార దక్షత రుజువయేది? మాలో వ్యాపార దక్షత





"లేదని ముందుగా ఎలా చెప్పగలరు?" అని విష్ణుగుప్తుణ్ణి సవాలు చేశారు.

విష్ణుగుప్తుడికి వారిని వదిలించుకునే దారి కనిపించలేదు. ఆయన కొంచెం ఆలోచించి, "మీ ఇద్దరికీ చెరొక వెయ్యి వరహాలూ ఇస్తాను. అది పెట్టుబడిగా పెట్టుకుని వ్యాపారం చేసి, సరిగా సంవత్సరమయేసరికి దాన్ని నూరింతలు పెంచి, లక్ష వరహాలతో ఎవరు వస్తే వారికి నా పిల్లనిచ్చి చేస్తాను," అన్నాడు.

ఆ కుర్రవాళ్ళు వ్యాపారం చేసి తమ పెట్టుబడిని వెయ్యిరెట్లు చేయగలుగుతారని విష్ణుగుప్తుడు ఎంత మాత్రమూ నమ్మలేదు. కాని వారిని వదిలించుకోవటానికి రెండువేల వరహాలు ఖర్చు పెట్టటం వల్ల పదిమంది లోనూ తన పరువు నిలబడుతుందని ఆయనకు తోచింది.

కాని దానగుప్త, ధనగుప్తులు మాత్రం కమలాక్షిని పెళ్ళాడటానికి మార్గం ఒకటి దొరికింది గదా అని సంతోషించారు. వారు తండ్రితో చెప్పి ఇంటి నుంచి ప్రయాణమై వర్తకం చెయ్యటానికి చెరొక దేశమూ వెళ్ళారు. సంవత్సరం ముగిసే సమయంలో వారు ఎక్కడ కలుసుకునేదీ ముందుగా నిర్ణయించుకున్నారు.

ఏడాది ముగియ వచ్చింది. అనుకున్న ప్రకారం ఇద్దరూ సంకేత స్థలంలో కలుసుకున్నారు. ఎవరి ముఖానా సంతోష చిహ్నాలు లేవు.

"నువు ఎంత సంపాదించావు?" అన్నాడు దానగుప్తుడు తమ్ముడితో.

ధనగుప్తుడు, "ముప్పైవేల వరహాలు సంపాదించాను. నువ్వయినా లక్ష పూర్తి చెయ్యగలిగావా?" అన్నాడు.

"లేదు. ఎనభైవేలు సంపాదించేసరికే నాకు ఎంతో కష్టమయింది," అన్నాడు దానగుప్తుడు.

"విష్ణుగుప్తుడు పెట్టిన పరీక్షలో ఇద్దరమూ ఓడాం. మనం పడిన శ్రమ అంతా వృథా అయింది," అంటూ ధనగుప్తుడు నిట్టూర్చాడు.

"వృథా కాలేదు! నేను చెప్పినట్టు చెయ్యి. నీ దగ్గిర ముప్పైవేలున్నాయి. నేను నీకు డెబ్భైవేలిస్తాను. ఆ లక్ష తీసుకు పోయి విష్ణుగుప్తుడి మొహాన కొట్టి, కమలాక్షిని పెళ్ళి చేసుకో," అన్నాడు దానగుప్తుడు.

"మరి నీ సంగతేమిటి?" అన్నాడు ధనగుప్తుడు.

"నేను ఇంటికి రాను. ఈ ఏడాది పాటూ వర్తకం చేసిన దేశానికే పోయి, ఏవైనా వర్తకవ్యాపారాలు చేసుకుంటాను," అని దానగుప్తుడు తమ్ముణ్ణి ఇంటికి పంపేసి, తాను వెనక్కు తిరిగి వెళ్ళాడు.

ధనగుప్తుడు లక్ష వరహాలతో విష్ణుగుప్తుడి వద్దకు తిరిగి వచ్చి, ఆయన కుమార్తెను పెళ్ళాడి సుఖంగా ఉన్నాడు.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, దానగుప్తుడు తానే ఎక్కువ సంపాదించి కూడా, కమలాక్షిని పెళ్ళాడేటందుకు తన తమ్ముడికెందుకు సహాయం చేశాడు? తమ్ముడి పైన ప్రేమవల్లనా? అతను అలా త్యాగం చెయ్యటానికి ప్రేరేపించినది ఏమిటి? ఈ ప్రశ్నకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలి పోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "దేవగుప్తుడి కొడుకులిద్దరూ కమలాక్షిని పెళ్ళాడగోరినది ఆమె తండ్రి ధనం సహాయంతో కోటీశ్వరులు కావాలనే. విష్ణుగుప్తుడు వారి సంపాదన శక్తికి పరీక్ష పెట్టాడు. ఆ పరీక్షలో తమ్ముడి కన్న అన్న బాగా నెగ్గాడు. అందుచేత కమలాక్షిని పెళ్ళి చేసుకునే అవసరం తమ్ముడికే ఎక్కువ ఉన్నట్టు స్పష్టమయింది. అన్న తన స్వశక్తితోనే కోటీశ్వరుడు కాగలడని రుజువయింది. అతను ఏడాది కాలంలో తన పెట్టుబడిని ఎనభై రెట్లు చేసుకున్నాడు. అలాటి శక్తి ఉన్నవాడు మూడు నాలుగేళ్ళలో కోటికి పడగ ఎత్తగలడు. అందుచేత అతను తన సంపాదనను తమ్ముడికి ధారపోశాడు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)



# ఎవడు సన్యాసి?

ఒక రాజుగారికి సన్యాసులంటే ఎంతో భక్తి. సంసారాన్ని త్యజించి, ముక్తిమార్గంలో పయనించే సన్యాసులు అందరి కన్నా గొప్పవారని ఆయన విశ్వాసం. అటువంటి సన్యాసులు భిక్షమెత్తుకుని బతకటం ఆయనకు నచ్చలేదు. అందుచేత ఆయన మంత్రిని పిలిచి, "మన రాజ్యంలో ఉన్న సన్యాసులందరికీ, ఒక్కొక్క సన్యాసికి పదివేల వరహాల చొప్పున పంచి పెట్టండి," అన్నాడు.

దేశంలో సన్యాసులకు కొదవలేదు. అందరికీ తలా పదివేలూ ఇస్తే ఖజానా ఖాళీయే!

అయినా రాజుకు ఎదురు చెప్పలేక, "చిత్తం, అలాగే!" అని మంత్రి వెళ్ళిపోయాడు.

మర్నాడు సభలో రాజు మంత్రిని, "మీకు అప్పగించిన కార్యం నెరవేర్చారా?" అని అడిగాడు.

"క్షమించాలి, మహారాజా! సన్యాసి అనే వాడెవడూ నాకు కనిపించలేదు," అన్నాడు మంత్రి.

రాజు ఆశ్చర్యపోయాడు.

"అవును, ప్రభూ! నిజమైన సన్యాసి తుచ్ఛమైన ధనం స్వీకరించడు. ధనం స్వీకరించిన వాడెవడూ నిజమైన సన్యాసి కాజాలడు," అన్నాడు మంత్రి.

—సింగంపల్లి అప్పారావు





# అబూ కీర్ సీర్

## 2

నలభై రోజులు గడిచిపోయాయి. తన పైత్య వికారం తగ్గలేదని అబూ కీర్ అంటూనే ఉన్నాడు; అబూ సీర్ వాణ్ణి మేపుతూనే ఉన్నాడు. అబూ కీర్ రెండు పూటలా కడుపు నిండా మెక్కేవాడు; కాని, "నగరం ఎంత అందంగా ఉందనుకున్నావు! దాన్ని చూడని జన్మ ఎందుకు?" అని అబూ సీర్ అనగానే, తన పైత్యవికారం మాట చెప్పి, పడుకుని నిద్ర పోయేవాడు అబూ కీర్.

ఇన్ని రోజులూ అబూ సీర్ తన మిత్రుణ్ణి మాట వరసకైనా మందలించిన పాపాన పోలేదు.

ఆ తరవాత మంగలి అబూ సీర్ జబ్బు పడి, బయటికి వెళ్ళలేక పోయాడు. అబూ కీర్‌కు కావలసిన ఆహారం తెచ్చిపెట్టుతూ, అతన్ని కనిపెట్టి ఉండమని అబూ సీర్ సత్రం దర్వానును బతిమాలాడు.

కొద్ది రోజులకల్లా అబూ సీర్ వ్యాధి ముదిరింది. అతను ఒళ్ళు తెలియని స్థితిలో శవం లాగా పడి ఉన్నాడు. అబూ కీర్‌ను ఆకలి మంట పక్కమీది నుంచి లేవగొట్టింది. అతను లేచి, తినటానికేమన్నా ఉన్నదేమోనని గది అంతా గాలించాడు. అతనికి ఏమీ దొరక లేదు. అబూ సీర్ దుస్తులన్నీ గాలిస్తే డబ్బు సంచీ దొరికింది. అది అబూ సీర్ చెమట ఓడ్చి కూడబెట్టిన కష్టార్జితం. అబూ కీర్ దాన్ని బొడ్లో దోపుకుని, అబూ సీర్ గతి ఏమవుతుందన్న విచారం ఏమీ లేకుండా, గది తలుపు బయటినుంచి గొళ్ళెంపెట్టి, ఎటో వెళ్ళిపోయాడు. అతను వెళ్ళిపోవటం దర్వాను ఎరగడు.

అబూ కీర్ తిన్నగా ఆహారాలమ్మే దుకాణానికి వెళ్ళి, కడుపునిండా తిని, బట్టల దుకాణానికి వెళ్ళి, మంచి దుస్తులు కొను



క్కని, వాటిని ధరించి, నగరపు వింతలు చూసి ఆనందిస్తూ, తాపీగా వీధుల వెంట నడవసాగాడు. అతనికి ఆ నగరంలో కొట్ట వచ్చినట్టు కనిపించిన వింత ఏమంటే, ఎవరిని చూసినా తెల్లదుస్తులో, నీలంరంగు దుస్తులో వేసుకున్నవారే. రంగు వేసిన దుస్తులంటూ కనబడితే అవి నీలంరంగు లోనే ఉన్నాయి. కన్ను పొడుచుకున్నా మరొక రంగు కానరాలేదు. దుకాణాలలో కూడా తెల్లబట్టలూ, నీలం బట్టలూ తప్ప మరో రంగు బట్ట లేదు. అబూ కీర్ ఒక కలంకారీ దుకాణంలోకి తొంగి చూశాడు. ఆ దుకాణంలోని తొట్టెలన్నిటి నిండా నీలం రంగే అతనికి కనబడింది.

అబూ కీర్ ఆ దుకాణంలో ప్రవేశించి, దుకాణదారుకు తన తెల్లని చేతి రుమాలు చూపి, "అయ్యా, దీనికి రంగు వెయ్యటానికి ఎంత తీసుకుంటారు? ఏ రంగు వేస్తారు?" అని అడిగాడు.

"నీలం రంగు వేస్తాను. ఇంకేమున్నది వెయ్యటానికి? ఇరవై దిరాములు తీసు కుంటాను," అన్నాడు దుకాణదారు.

"ఏమిటీ? ఈ కాస్త గుడ్డముక్కకు నీలి రంగు వెయ్యటానికి ఇరవై దిరాములా? మా దేశంలో ఇందుకు అర దిరాము పైన అడగరే!" అన్నాడు అబూ కీర్ ఆశ్చర్యా గ్రహాలతో.

"అలా అయితే మీ దేశంలోనే రంగు వేయించుకో. ఈ దేశంలో ఇరవై దిరా ములకు తక్కువ ఉండదు," అన్నాడు దుకాణదారు.

"సరే, నువు అడిగినంతా ఇస్తాను. ఈ రుమాలుకు ఎర్రరంగు వెయ్యి," అన్నాడు అబూ కీర్.

"ఎర్ర రంగేమిటి? అలాటి రంగు ఎక్క డుంది?" అన్నాడు దుకాణదారు.

"పోనీ, ఆకుపచ్చరంగు వెయ్యి," అన్నాడు అబూ కీర్.

"ఆకుపచ్చరంగు మాత్రం ఎక్కడుంది? నేను దాని పేరే వినలేదు," అన్నాడు దుకాణదారు.

అబూ కీర్ తనకు తెలిసిన రంగుల పేర్లన్నీ చెప్పాడు. దుకాణదారు ఆ పేర్లు కూడా ఎరగడన్నది స్పష్టమయింది.

"పోనీ నేను చెప్పిన రంగులు వేయగల వాళ్ళు ఇంకెవరన్నా నగరంలో ఉన్నారా?" అని అబూ కీర్ అడిగాడు.

"ఈ నగరంలో కలంకారీ పని చేసే వాళ్లం నలభైమందిమి ఉన్నాము. మేమంతా ఒక సంఘంగా ఏర్పడ్డాం. మేము తప్ప ఇంకెవరూ కలంకారీ పని చెయ్యటానికి వీల్లేదు. ఈ విద్య మాకు వంశపారం పర్యంగా వస్తున్నది. దీన్ని కొత్తవాళ్ళకు చెప్పము. మేమందరమూ కూడా బట్టలకు నీలిరంగే వేస్తాం," అని దుకాణదారు అబూ కీర్‌తో అన్నాడు.

అబూ కీర్ అతనితో, "అయ్యా, నన్ను పనిలోకి తీసుకో. నేనూ కలంకారీ వాణ్ణే. ఏ రంగు కావాలంటే ఆ రంగు బట్టలకు వేసే కిటుకు నీకు చెబుతాను. నువు మిగిలిన కలంకారీ వాళ్ళందరినీ అవలీలగా మించిపోయి, పైకి రాగలుగుతావు." అన్నాడు.

"మేము పైవాళ్ళను పనిలోకి తీసుకోము," అన్నాడు దుకాణదారు.

"అలా అయితే, నేను సొంతాన కలంకారీ దుకాణం పెడితే ఏమవుతుంది?" అన్నాడు అబూ కీర్.



"అది అసంభవం! నీ వల్లకాదు!" అన్నాడు దుకాణదారు.

అబూ కీర్ ఇంకేమీ అనక ఆ దుకాణం వదిలిపెట్టి, మరి కొన్ని కలంకారీ దుకాణాలు తిరిగాడు. ఎక్కడికి పోయినా ఎవరూ అతన్ని పనిలో పెట్టుకోవటానికి ఒప్పుకోలేదు. చివరకు అతను కలంకారీ సంఘం పెద్ద వద్దకు వెళ్ళాడు.

"నేను మాత్రం ఏం చెయ్యగలను? పైవాళ్ళను మా వృత్తిలో చేర్చుకోవటం ఆచారానికీ, ఆచరణకూ విరుద్ధం," అన్నాడు కలంకారీ వాళ్ళ పెద్ద.

అబూ కీర్‌కు కడుపు మండిపోయింది. అతను తిన్నగా ఆ దేశపురాజు వద్దకు వెళ్ళి,



"మహారాజా, నేను పరదేశీవాణ్ణి. నాది కలంకారీ వృత్తి. నేను బట్టలకు వేసిన రంగు వెయ్యకుండా నలభై రంగులు వెయ్యగలను. అయినప్పటికీ తమ నగరంలోని కలంకారీ వాళ్ళు నాకు తమ వృత్తిలో చోటు లేకుండా చేస్తున్నారు. వారికేమో నీలంరంగు తప్ప మరొక రంగే తెలీదు. నేను ఏ బట్టకైనా సరే ఎన్నో రకాల ఎరుపూ, పసుపూ, ఆకుపచ్చా వేయగలను," అంటూ తన గోడు చెప్పుకున్నాడు.

అబూ కీర్ చెప్పే రంగుల జాబితా విని రాజు దిగ్భ్రమచెంది, "నువు నిజంగా బట్టలకు అన్ని రంగులు వేయాలి గాని, నీకు కావలిసినంత డబ్బు నేనే ఇచ్చి, కలంకారీ దుకాణం పెట్టిస్తాను. నగరంలోని కలంకారీ వాళ్ళ గొడవ నీకేమీ వద్దు. వారిలో ఎవడన్నా నీ జోలికి వచ్చాడో వాణ్ణి వాడి దుకాణం వాకిటనే ఉరి తీయిస్తాను," అన్నాడు.

ఆయన తన ఆస్థాన వాస్తుప్రవీణులను పిలిచి, "మీరు ఈయన వెంట వెళ్ళి, ఆయన ఎన్నుకున్న ప్రదేశంలో ఎలాంటి భవనంగాని, తోటగాని ఉన్నా సరే దాన్ని నేలమట్టం చేసి, అక్కడ ఒక కలంకారీ కార్ఖానా నిర్మించండి. అందులో నలభై పెద్ద తొట్టెలూ, నలభై చిన్న తొట్టెలూ ఉంచడానికి అవకాశం ఉండాలి. ఈయన ఏమి చెబితే అది అక్షరాలా చెయ్యండి," అన్నాడు.

తరవాత రాజుగారు అబూ కీర్‌ను దుశ్శాలువలతో సత్కరించి, వెయ్యి దీనారాలను, ఇద్దరు కుర్రవాళ్ళనూ ఇచ్చి, "నీ దుకాణం తయారయేదాకా ఈ డబ్బు ఖర్చుకు ఉంచుకుని, ఈ కుర్రవాళ్ళను నౌకర్లుగా ఉపయోగించుకో," అన్నాడు. అబూ కీర్ ఉండటానికి ఒక మంచి భవంతినీ, అనేకమంది బానిసలనూ ఇచ్చాడు. అతను నగరంలో ఎక్కి తిరగటానికి మంచి గుర్రాన్ని కూడా ఇచ్చాడు.

మర్నాడు అబూ కీర్ మిలమిలా మెరిసే చెమ్కీ దుస్తులు ధరించి, గొప్ప అమీర్ లాగా గుర్రం ఎక్కి ఊరి మీద బయలు

దేరాడు. అతని నౌకరు కుర్రాళ్ళూ, వాస్తు ప్రవీణులూ అతని ముందు నడిచారు. అబూ కీర్ వీధులన్నీ తిరిగి, చివరకు వర్తకుల పేట మధ్య గల ఒక పెద్ద దుకాణాన్ని ఎన్నుకున్నాడు. వెంటనే రాజుగారి మనుషులు దుకాణం గలవాళ్లని అక్కడినుంచి వెళ్ళగొట్టి, ఒక చెంపనుంచి ఇంటిని పడగొట్టుతూ, కొత్త భవనం కట్టుకురాసాగారు. అబూ కీర్ గుర్రంమీద కూర్చునే, "ఇక్కడ ఇలా కట్టండి. అక్కడ అలా కట్టండి," అని కట్టేవాళ్ళను హెచ్చరించాడు. త్వరలోనే, ప్రపంచంలో మరెక్కడా లేని కలంకారీ కార్ఖానా తయారయింది.

రాజుగారు అబూ కీర్‌ను పిలిపించి, "ఇక నువ్వు పని ప్రారంభించు. అందుకు నీకు డబ్బు కావలసి ఉంటుంది. ప్రస్తుతానికి ఈ అయిదువేల దీనారాలు తీసుకో. నీ కలంకారీ పనితనం చూడాలని నేను ఆత్రంగా ఉన్న సంగతి గుర్తుంచుకో," అన్నాడు.

అబూ కీర్ రాజుగారిచ్చిన డబ్బంతా తన ఇంట్లో దాచి, కొద్ది చిల్లర డబ్బులతో తనకు కావలసిన మందులను దుకాణాలలో కారు చౌకగా కొని, తొట్టెలన్నిటి నిండా రంగులు కలిపి పెట్టాడు.

రాజుగారు అతని వద్దకు నూలువీ, పట్టువీ, ఉన్నివీ అయిదు వందల తానులు పంపాడు. అబూ కీర్ కొన్నిటికి ప్రత్యేకమైన రంగులూ, మరికొన్నిటికి రంగుల మిశ్రమాలూ వేసి, ఏ రెండు గుడ్డముక్కలూ ఒకరంగులో కనిపించకుండా చూసి, తన



కార్ఖానా బయట వీధి పొడుగునా ఆరగట్టాడు. ఎండలో అవి ఎంతో చూడముచ్చటగా ఉన్నాయి.

ఈ దృశ్యం చూడటానికి నగరవాసులు తండోపతండాలుగా వచ్చారు. వర్తకులు తమ దుకాణాలను మూసి మరీ వచ్చారు. పిల్లలూ, ఆడవాళ్ళూ ఆ రంగురంగుల బట్టలు చూసి ఆనందోద్రేకం చెంది కేకలు పెట్టారు. అనేకమంది అబూ కీర్‌ను వేరు వేరు రంగుల పేర్లు అడిగి చెప్పించుకున్నారు.

జనం చేసే కోలాహలం ముమ్మరంగా ఉండగా రాజుగారే స్వయంగా అక్కడికి వచ్చాడు. ఎండలో నయనానందకరంగా కనిపించే రంగుల తోరణాన్ని చూసి ఆయన తన్మయత్వంలో చాలాసేపు కొయ్యబొమ్మ లాగా నిలిచిపోయాడు.

ఇంత నేర్పరి అయిన కలంకారీ నిపుణుడికి తగిన మర్యాద ఎలా చేయాలో రాజు గారికి తెలియలేదు. ఆయన తన వజీరును అతని గుర్రం మీది నుంచి దిగమని, దాని మీద అబూ కీర్‌ను కూర్చోబెట్టాడు. తరవాత ఆయన రంగుబట్టలన్నిటినీ కట్టించుకుని, అబూ కీర్‌ను వెంటబెట్టుకుని తన భవనానికి వెళ్ళి, అబూ కీర్‌కు బంగారమూ, విశేషాధికారాలూ ఇచ్చి గౌరవించి పంపేశాడు. తరవాత ఆయన రంగుబట్టలతో తనకూ, తన భార్యలకూ, రాజభవనంలోని ఉద్యోగులకూ దుస్తులు తయారు చేయించి, మరొక వెయ్యితానులను రంగు వెయ్యటానికి కలంకారీ కార్ఖానాకు పంపాడు.

కొద్దికాలం గడిచేసరికి నగరంలో గొప్పవారంతా రంగు రంగుల ఉడుపులు ధరిస్తూ కనబడ్డారు. ఆస్థాన కలంకారీవాడైన అబూ కీర్ నగరానికంతటికీ గొప్ప ధనవంతుడయాడు. నగరంలోని కలంకారీ పనివాళ్ళు నలభైమందీ అతని వద్దకు వచ్చి, క్షమాపణలు చెప్పుకుని, తమను జీతంలేకుండా పని నేర్చుకునే వాళ్ళుగా పెట్టుకోమని అతన్ని ప్రార్థించారు. అతను వారందరినీ అవమానించి పంపేశాడు. కాలక్రమాన నగరమంతటా రంగు రంగుల దుస్తులు కనిపించాయి. —(ఇంకావుంది)





# విచిత్ర ఘటన

మణిపుర మహారాజు చంద్రసేనుడికి ఒకతే కూతురు. ఆమె పేరు చంద్రముఖి. చిన్నతనంలోనే తల్లిని పోగొట్టుకున్న చంద్రముఖిని రాజు ఎంతో గారాబంగా పెంచాడు. యుక్తవయసు వచ్చేలోపల ఆమె అన్ని విద్యలలోనూ ప్రవీణురాలయింది. చంద్రసేనుడు తన కుమార్తెకు పెళ్ళి చేద్దామనుకున్నాడు గాని, చంద్రముఖి పెళ్ళికి సుముఖురాలుగా లేదు.

చంద్రముఖి తరచుగా తన చెలికత్తెలతో కలిసి వేటకు వెళ్ళేది. ఒకరోజు వేటలో ఆమె తన చెలికత్తెల నుంచీ, పరివారం నుంచీ వేరుపడి, ఒంటరిగా అరణ్యంలో చిక్కుకుపోయింది. మిగిలినవాళ్ళు ఆమె కోసం ఎంతో వెతికారు, కాని ప్రయోజనం లేకపోయింది. చీకటి పడినదాకా చూసి, రాజకుమార్తె ఏ క్రూరమృగం వాతనో పడిందనుకుని నిరాశచెంది, మిగిలిన వారు రాజభవనానికి తిరిగి వెళ్ళి, జరిగిన సంగతి రాజుగారితో చెప్పారు.

అయితే అంతకు పూర్వమే చంద్రముఖి ఇల్లు చేరుకుని, తన పరివారం గతి ఏమయినదీ ఎవరికీ చెప్పక, ఇంకా చీకటి పడక ముందే తన పడక గదికి వెళ్ళిపోతూ, తెల్లవారిన దాకా తనను లేపవద్దని హెచ్చరించింది. అది మొదలు ఆమె పరధ్యానంగానూ, విచారంగానూ ఉన్నట్టు అందరికీ కనిపిస్తూ వచ్చింది. దానికి కారణం ఏమిటో ఆమెచేత ఎంత ప్రయత్నించీ ఎవరూ చెప్పించలేక పోయారు.

ప్రతిరోజూ ఆమె చీకటిపడకముందే తన గదికి వెళ్ళిపోయి, తలుపులు ఓగించుకుని, తెల్లవారినదాకా బయటికి వచ్చేది కాదు.

ఆమెకు త్వరలో వివాహం చెయ్యటం మంచిదని రాజుకు తోచింది. అందుకు చంద్రముఖి ఒప్పుకున్నది. రాజు పరమా

టి. ఇందిరాదేవి



నంద భరితుడై ఆమెకు స్వయంవరం ఏర్పాటు చేశాడు. స్వయంవరం నాటికి అనేకమంది రాజకుమారులు వచ్చారు. ఎందుకంటే, చంద్రముఖి గొప్ప సౌందర్యవతి అని ప్రతీతి ఉండేది.

చంద్రముఖి దట్టమైన మేలిముసుగు ముఖానికి కప్పుకుని, చేతిలో వరమాల పట్టుకుని స్వయంవర మంటపానికి వచ్చింది. ఆమె ఏ రాజకుమారుడినీ పరీక్షగా చూసినట్టు కనిపించలేదు. మొక్కు తీర్చుకునే దానిలాగా ఆమె ఎవరో ఒకరి మెడలో మాల వేసి, చప్పున అంతఃపురంలోకి తిరిగి వెళ్ళిపోయింది. అప్పటికే సూర్యాస్తమయం కావచ్చింది.

రాజకుమార్తె ప్రవర్తన అందరికీ ఆశ్చర్యాన్ని కలిగించింది. అలాటి స్వయంవరాన్ని ఎవరూ, ఎక్కడా చూసి ఉండలేదు. ఏమైనా స్వయంవరం ముగిసింది గనక, వరమాల అందుకున్న చేదిదేశపు యువరాజు చక్రసేనుడు తప్ప, మిగిలిన వారందరూ తమ తమ దేశాలకు వెళ్ళిపోయారు. చక్రసేనుడు మాత్రం ఆ రోజు చంద్రసేన మహారాజు ఆతిథ్యం స్వీకరించాడు. మర్నాడు చంద్రసేనుడు తన అల్లుడి కత్తిని తీసుకుని, అతన్నీ, అతని పరివారాన్నీ సగౌరవంగా చేదిదేశానికి తిప్పి పంపాడు. కత్తికి పెళ్ళి చెయ్యటం మణిపుర రాజవంశ సంప్రదాయం.

చంద్రముఖికీ, చక్రసేనుడి కత్తికీ వైభవంగా వివాహం జరిగింది. వివాహం జరిగినా చంద్రముఖి ప్రవర్తనలో మార్పేమీ కనిపించలేదు. ఒక నెల రోజులు కుమార్తెను తన వద్దనే ఉంచుకుని, ఒక శుభ ముహూర్తాన కట్నకానుకలలో చంద్రసేన మహారాజు ఆమెను సపరివారంగా అత్తవారింటికి పంపాడు.

చంద్రముఖి వచ్చిన రోజు చేదినగరంలో గొప్పగా వేడుకలు జరిగాయి. ఆ రాత్రి వధూవరుల శోభనం ఏర్పాటయింది. చంద్రముఖి సూర్యాస్తమానం కాకుండానే భోజనం చేసి, శయ్యాగృహానికి చెలికత్తెల వెంట

వెళ్ళి, చీకటి పడే లోపుగా తన చెలికత్తె లందరినీ పంపేసి తాను గదిలో ఒంటరిగా మిగిలిపోయింది.

పెళ్ళికొడుకైన చక్రసేనుడు రాత్రి కొంత పొద్దుపోయి శయ్యాగృహానికి వెళ్ళాడు. కాని అక్కడ ఎవరూ లేరు. తన భార్య గొప్ప అందగత్తె అని విన్నాడే గాని చక్రసేనుడు ఇంతదాకా ఆమె ముఖం చూసి ఎరగడు. ఆమె కనిపించకపోయేసరికి అతనికి ఆశాభంగమయింది. అతను తన భార్యను గురించి అందరినీ అడిగాడు. ఆమె ఏమై పోయినదీ ఎవరికీ తెలీదు. రాజభవనం అంతా వెతికారు గాని ఆమె జాడ కనిపించలేదు.

చక్రసేనుడు ఆ రాత్రికి రాత్రే తన భార్యను వెతుకుతూ గుర్రం మీద బయలు దేరాడు. అతను నగరం దాటగానే, నడిచి పోతూ ఒక ముసలిది గుడ్డి వెన్నెలలో కనిపించింది. అతను ఆమెను చేరుకుని, "అవ్వా, ఈ దారివెంట వయసులో ఉన్న స్త్రీ ఎవరన్నా వెళ్ళటం చూశావా?" అని అడిగాడు.

ముసలిది ఏదో గొణుక్కుని, "ఎవరు, నాయనా, నువ్వు? ఏమిటి కథ?" అని అతన్ని అడిగింది.

చక్రసేనుడు ముసలిదానికి జరిగినదంతా చెప్పాడు.



"ఆ మనిషే అయి ఉంటుంది, నాయనా! కొంతసేపటి కిందట ఇటుగా పరిగెత్తుకుంటూ వెళ్ళింది. ఎంత ఘోరం!....నన్నుకూడా గుర్రంమీద ఎక్కించుకున్నావంటే ఇద్దరమూ కలిసి వెతుకుదాం." అన్నది ముసలిది.

ఇద్దరూ గుర్రంమీద చాలాసేపు ఆ ప్రాంతాలగల దారులన్నీ తిరిగారు. కాని చంద్రముఖి జాడలేదు.

"నాయనా, చాలా దూరం తిరిగాం. ఇంకో ఝాముకల్లా తెల్లవారిపోతుంది. ఈ చెట్టు కింద కాస్త విశ్రమించుదాం," అన్నది ముసలిది. అప్పటికి గుడ్డివెన్నెల కూడా పోయి. కటిక చీకటి ఆవరించటంచేత

చక్రసేనుడు ఆమె సలహా పాటించి, ఒక చెట్టు కింద పడుకుని వెంటనే నిద్రపోయాడు.

మర్నాడు ఎండ ముఖంమీద పడ్డాక గాని అతనికి మెలకువ రాలేదు. అతను నిద్ర లేస్తూనే అవ్వ కోసం చూశాడు. కాని ఆమె ఎటో వెళ్ళినట్టున్నది. అతనికి కొంత దూరంలో ఒక సెలయేరూ, దాని పక్కన ఒక గుడిసె కనిపించాయి. ఆ గుడిసె బయట ఎవరో స్త్రీ నిలబడి ఉన్నది. చక్రసేనుడు వెళ్ళి చూస్తే ఆమె అవ్వకాదు. ఈమె మంచి వయసులో ఉండి, చూడటానికి ఎంతో అందంగా ఉన్నది. ఈమె ధరించిన బట్టలు అవ్వ ధరించినవి లాగే ఉన్నాయి.

"ఎవరు నువు? నీకిక్కడ అవ్వ ఎవరన్నా కనిపించిందా?" అని చక్రసేనుడు ఆ పిల్లను అడిగాడు.

"నా పేరు చంప. ఆ అవ్వ మా అవ్వే అయి ఉంటుంది. మా అవ్వ మంత్రగత్తె. ఏ మూలికలో తీసుకురావటానికి వెళ్ళి ఉంటుంది. మే మిద్దరమూ ఈ గుడిసెలోనే ఉంటున్నాం." అన్నది ఆ పిల్ల.

చక్రసేనుడికి ఆ పిల్లను వదిలి వెళ్ళ బుద్ధికాలేదు. ఆమె మీద అతనికి అంతు లేని మోహం పుట్టుకొచ్చింది. అతను ఆమెతో ఆ గుడిసెలోనే చాలాసేపు గడిపి, మళ్ళీవస్తాననిచెప్పి, తన గుర్తుగా ఆమెకు తన ఉంగరం ఇచ్చి, తన ఇంటికి తిరిగి వచ్చేశాడు.



చంద్రముఖి కోసం చాలారోజులు వెతికి, విసిగిపోయి, ఆమె మరి కనిపించదనీ, కనిపించినా ఆమెను కోడలుగా స్వీకరించనవసరం లేదని చక్రసేనుడి తల్లిదండ్రులు నిర్ణయించుకున్నారు. చక్రసేనుడు ప్రతి ఉదయమూ చంప వద్దకు వచ్చి ఆమెతో సాయంకాలందాకా ఉంటూ, చీకటి పడే వేళకు ఇంటికి తిరిగి పోతున్నాడు. రాను రాను అతనికి ఆమె మీద అపారమైన ప్రేమ ఏర్పడి, ఆమెను ఒక్క ఘడియ విడిచి పెట్టటంకూడా అసాధ్యంగా తోచసాగింది.

అందుచేత అతను ఒకనాడు చంపతో, "నువు నాతో వచ్చెయ్యి. మనిద్దరమూ పెళ్ళి చేసుకుని హాయిగా ఉందాం. మా వాళ్ళు అభ్యంతరం చెప్పరు," అన్నాడు.

"అది ఇప్పట్లో సాధ్యం కాదు. మా అవ్వ నన్ను వదిలే రోజు వస్తుంది. అప్పుడు నేను తప్పక మీ ఇంటికే వస్తాను. మనకు గాంధర్వ వివాహం కానే అయింది గద! కొద్ది కాలం ఓపిక పట్టండి," అన్నది చంప.

ఆమె గర్భవతి అయి, నెలలు నిండ సాగాయి.

"ఈ స్థితిలో నువు ఇక్కడ ప్రసవించటం సాధ్యంకాదు. నాతో వచ్చెయ్యి. నీ ప్రసవానికి కావలసిన ఏర్పాట్లన్నీ నేను చేస్తాను," అన్నాడు చక్రసేనుడు.

చంప ఒప్పుకోలేదు.

"కనీసం ఇక్కడికి పరిచారికలనూ, మంత్రసానులనూ పంపుతాను," అన్నాడు చక్రసేనుడు.





చంపు అందుకు కూడా ఒప్పుకోక, "ఎవరినీ తీసుకురావద్దు. మా అవ్వ వెయ్యిమంది మంత్రసానులకు సమానం. నా ప్రసవం గురించి మీకు ఏ భయమూ వద్దు," అన్నది.

చక్రసేనుడు రోజూ వచ్చి చంపను చూసిపోతూనే ఉన్నాడు. ఒకనాడు అతనికి తన ఇంట నిద్ర పట్టలేదు. ఆ రాత్రి చంప ప్రసవిస్తుందని అతనికి ఎందుకో అనుమానం తోచింది. ప్రసవసమయంలో తను దగ్గిర ఉండాలనిపించింది. అందుచేత అతను చంద్రముఖి ఇష్ట సఖి అయిన మాలతి అనే ఆమెను వెంటబెట్టుకుని, భవనంలో ఎవరికీ ఏమీ చెప్పకుండా, ఎంతో రహస్యంగా బయలుదేరి చంప ఉండే గుడిసెకు చేరుకున్నాడు.

గుడిసెలో నుంచి ప్రసవవేదన వినవస్తున్నది. చక్రసేనుడు బయటనే ఉండి, మాలతిని లోపలికి వెళ్ళి సహాయపడమన్నాడు. మాలతి లోపలికి వెళ్ళుతూనే కెవ్వున అరిచి, బయటికి వచ్చింది. లోపల ఏదో దారుణం జరిగిందనుకుని చక్రసేనుడు తానే లోపలికి వెళ్ళి, అక్కడి దృశ్యం చూసి కొయ్యబారిపోయాడు.

లోపల ప్రసవవేదన పడుతున్న మనిషి చంప కాదు—అవ్వ!

చక్రసేనుడికి తల తిరిగి పోయింది. అతను, "అవ్వా, నీకీ దుస్థితి ఎలా కలిగింది? చంప ఎక్కడ?" అన్నాడు.

అవ్వ బాధలోనే, "ముందు నాకు సహాయం కావాలి! మాలతిని రమ్మనండి!" అని మూలిగింది.

చేసేది లేక చక్రసేనుడు బయటికి వచ్చి, మాలతిని లోపలికి పంపాడు. అవ్వకు మాలతి పేరు ఎలా తెలుసునన్న అనుమానం కూడా అతనికి రాలేదు.

మాలతి లోపలికి వచ్చిన మరుక్షణం లోనే అవ్వ పండులాటి మగపిల్లవాణ్ణి కని తన ముసలిరూపం పోగొట్టుకున్నది.

"చంద్రముఖీ! నువా?" అని మాలతి అరవటం బయట ఉన్న చక్రసేనుడు

విన్నాడు. అతను లోపలికి వెళ్ళి చంపనూ, పిల్లవాణ్ణీ చూశాడు.

"చంపా! నువేనా ప్రసవించింది? ఆ ముసలిది ఏమయింది?" అన్నాడు చక్రసేనుడు.

"నేనే ఆ ముసలిదాన్ని! నేనే చంద్రముఖిని కూడా! తెలియక ఒక పాపం చేసి, శాపం పొంది, పడరాని పాట్లూ పడ్డాను. ఈ బిడ్డ కలగటంతో నా శాపం తీరిపోయింది," అంటూ చంద్రముఖి జరిగిన సంగతి ఇలా చెప్పింది:

ఆమె వేటకు వెళ్ళిన రోజు అరణ్యంలో ఒంటరిదై పోయి, పొదలచాటున లేడి కన పడ్డట్టు తోచి, బాణం వేసి ఒక మునిని కొట్టింది. ఆయన కోపించి, ఆమెను ముసలి దానివి కమ్మని శపించాడు. చంద్రముఖి ఆయన కాళ్ళ మీద పడి, ఏడ్చి, శాపం ఉపసంహరించమని ప్రార్థించింది. రాత్రి వేళ మాత్రమే ఆమె ముసలిదై పోయే టట్టూ, ఒక పిల్లవాణ్ణి కన్న తరవాత ఆమెకు శాపవిమోచనం కలిగేటట్టూ ముని అనుగ్రహించాడు. అందుచేతనే రాత్రివేళ ఆమె ఎవరి కంటా పడలేదు. ఆమె వివాహం చేసుకున్నది కూడా గర్భం ధరించి, శాపవిముక్తి పొందుదామనే. తనకు కాబోయే భర్త ఎవరన్నది అప్పుడామెకు పట్టలేదు. కాని పెళ్ళితో ఆమె సమస్య తీరలేదు. రాత్రివేళ ఆమె భర్త కళ్ళ పడటానికి లేదు. అదృష్టవశాన ఆమె రాత్రివేళ తన భర్త కళ్ళపడకుండా గర్భవతి అయి, పిల్ల వాణ్ణి కని శాపవిముక్తి పొందగలిగింది. అయితే ఒక సంవత్సరమంతా మనుషులకు దూరంగా అరణ్యంలోని ఒక పాడుబడిన గుడిసెలో నివసించి, రాజకుమార్తె అయిన మనిషి పడలేని పాట్లూ, కష్టాలూ అన్నీ పడింది.

అంతా విని చక్రసేనుడు తన భార్య ధైర్యసాహసాలనూ, దృఢనిశ్చయాన్నీ అభి నందించి, ఆమెనూ, తన కుమారుణ్ణీ తన నగరానికి తీసుకుపోయి, జరిగినదంతా తన తల్లి దండ్రులకు చెప్పి, భార్యాబిడ్డలతో సుఖంగా ఉన్నాడు.



# తల విలువ నోరు చెబుతుంది

ఒకనాడు ఒక రాజు వేటకు వెళ్ళి, చాలాసేపు వేటాడి అలిసిపోయి, ఒక బావి దగ్గిర విశ్రాంతి తీసుకున్నాడు. రాజుకు దాహంగా ఉన్నది. దగ్గిరే బావి ఉన్నది గాని, నీరు తోడటానికి చేద లేదు.

సమీపంలోనే ఒక కుటీరం ఉన్నది. అందులో ఒక గుడ్డి సాధువు ఉంటున్నాడు. ఆ కుటీరానికి వెళ్ళి చేద తీసుకురమ్మని రాజు ఒక భటుణ్ణి పంపాడు. ఆ భటుడు సాధువును చూసి, "ఒరే, ఒక్క బైరాగి, నీరు తోడే చేద ఇయ్యి," అన్నాడు.

"నా వద్ద చేద లేదు," అన్నాడు సాధువు.

తరవాత రాజు తన మంత్రిని పంపాడు. మంత్రి వచ్చి, "ఏమోయ్, సాధూ! నీ దగ్గిర చేద ఉండకుండా ఉంటుందా? ఒక్కసారి ఇయ్యి. నీరు తోడుకుని ఇచ్చేస్తాం," అన్నాడు.

"అయ్యా, నా దగ్గిర చేద నిజంగానే లేదు," అన్నాడు సాధువు.

ఈసారి రాజే బయలుదేరి వచ్చి, "స్వామీ, దాహంతో బాధ పడుతున్నాను. బావిలో నీరు తోడటానికి చేద ఇవ్వండి," అన్నాడు.

"మహారాజా, తమకు మంచి నీరే ఇస్తాను. ఒక్కక్షణం ఆగండి," అంటూ సాధువు లేచాడు.

రాజు ఆశ్చర్యపడి, "నేను రాజునని మీ కెలా తెలిసింది?" అని అడిగాడు.

"మహారాజా, తల విలువ నోరే చెబుతుంది!" అన్నాడు గుడ్డి సాధువు.

—వి. శ్రీరామ్





# ధైర్యంవల్లలాభం

ఒక గ్రామంలో ఒక బ్రాహ్మణుడు ఉండేవాడు. ఆయన ప్రేతకర్మలు చేయించేవాడు. ఆయన చాలా ధైర్యశాలి. దుర్మరణాల పాలైనవారికి కూడా దహనసంస్కారాలు చేయించేవాడు. ఎక్కడన్నా మనుషులు హత్య చేయబడినా, ఉరిపోసుకు చచ్చినా దహనసంస్కారాలు చెయ్యటానికి ఈ బ్రాహ్మణ్ణే పిలిచేవారు. ఎందుకంటే, అలాటి శవాలకు సంస్కారం జరిపించటానికి మామూలు బ్రాహ్మలు భయపడేవారు. బలవంతపు చావు చచ్చినవాళ్ళు దయ్యాలయి, బతికున్నవాళ్ళను బాధిస్తారని అందరూ నమ్మేవారు.

ఈ ప్రేతకర్మలు చేయించే బ్రాహ్మణ్ణి ఒకసారి, ఏడెనిమిది మైళ్ళ దూరంలో ఉన్న ఒక గ్రామంవాళ్ళు పిలిచారు. అక్కడ ఆ బ్రాహ్మడు తన పని పూర్తి చేసేసరికి చీకటి పడిపోయింది.

"ఈ చీకట్లో మీ ఊరు వెళ్ళవద్దు. ఈ రాత్రికి ఇక్కడే పడుకుని, రేపు ఉదయం వెళ్ళవచ్చు," అన్నారు గ్రామస్థులు.

"ఎందుకూ? భోజనంవేళకు ఇల్లు చేరిపోనూ?" అన్నాడు బ్రాహ్మడు.

"మరేం లేదు. మా ఊరికీ మీ ఊరికీ మధ్య ఉండే శ్మశానంలో దయ్యాలున్నాయట. అవి రాత్రివేళ ప్రయాణీకులను పట్టుకుని నానా తిప్పలూ పెడతాయట," అన్నారు గ్రామస్థులు.

బ్రాహ్మడు విరగబడి నవ్వుతూ, "దయ్యాలూ, భూతాలూ నన్నేం చేస్తాయి? నేనీ రాత్రికి ఇల్లు చేరాలి," అంటూ బయలుదేరాడు.

వెన్నెల రాత్రి. ఆకాశం నిర్మలంగా కూడా ఉన్నది. అందుచేత బ్రాహ్మడు మరింత నిశ్చింతగా నడక సాగించాడు.

సి. వాసుదేవరావు



దాదాపు సగం దారి నడిచాక ఆయనకు ఒక పూరిపాక కనబడింది. అందులో ఎవరూ లేరని మొదట అనుకున్నాడుగాని, పరీక్షగా చూస్తే ఎవరో ఆడది పాక ముందు నీడలో నిలబడి కనిపించింది. ఆమె ఇంటికేసి తిరిగి ఉండి, బ్రాహ్మడు సమీపించినా కూడా అయన కేసి తిరగలేదు.

"ఇది ఏ మొగుడితోనో, అత్తగారితోనో దెబ్బలాడి, ఎవరికీ చెప్పకుండా పారిపోయి వచ్చి ఉంటుంది. తెల్లారే లోపల ఏ నూతిలోనో, గోతిలోనో దూకి ప్రాణాలు తీసుకుంటుంది. ఇటువంటివాళ్ళకు చాలా మందికి దహనాలు నా చేతిమీదగా చేయించాను. ఈ పిల్లకు కాస్త బుద్ధి చెప్పి ఇంటికి పంపెయ్యాలి." అనుకున్నాడు బ్రాహ్మడు.

"ఎవరివే నువు, నిర్భాగ్యురాలా? ఈ వేళప్పుడు ఇక్కడ ఎందుకున్నావు? నువు ఎవరో, నీకు వచ్చిన కష్టమేమిటో దాచకుండా నాతో చెప్పు. నేనెవరికీ చెప్పనులే. నీకు అభ్యంతరం లేకపోతే నిన్ను మీ ఇంటికి చేర్చుతాను కూడా!" అన్నాడు బ్రాహ్మడు ఆ మనిషితో.

ఆమె అప్పటికీ వెనక్కు తిరగక, "ఊళ్ళోవాళ్ళ విషయాలన్నీ నీకెందుకు? నీ దారిన నువు పోరాదూ?" అన్నది అమర్యాదగా.

ఆ మనిషి ఒకంతట దారికి వచ్చేరకంగా లేదనుకుని బ్రాహ్మడు, "అడిగిన మాత్రాన అంత గింజుకుంటావేం? ఈ వేళప్పుడు నిన్నిలా విడిచి నా దారిన పోవాలంటే నా అంతరాత్మ ఒప్పుతుందా? మీది ఏ గ్రామమో చెప్పు. కనీసం నీ పేరైనా చెప్పు. లేదూ, మీవాళ్ళెవరో చెబితే, వాళ్ళకు కబురు అందిస్తాను. వాళ్ళు వచ్చి నిన్ను తీసుకుపోతారు." అన్నాడు.

"మంచిగా వెళ్ళవన్నమాట. నిన్ను పట్టుతాను, కాచుకో!" అంటూ ఆమె వెనక్కు తిరిగింది. ఆమె ముఖం రక్తహీనంగా, పాలిపోయి సుద్దలాగా ఉన్నది. ఆమె తప్పక దయ్యమే అయిఉండాలని

బ్రాహ్మడు గ్రహించాడు. ఆయనకు దడ ప్రారంభమయింది. కాని ధైర్యం గలవాడని తన కున్న ఖ్యాతిని కాపాడుకోగలందులకు ఆయన తన భయాన్ని తొక్కిపట్టి, "నన్ను పట్టుతావా? ఏదీ పట్టు! దయ్యం పట్టాలని నే నెంతో కాలంగా ఎదురు చూస్తున్నాను," అంటూ పెద్దగా నవ్వాడు.

దయ్యం జుట్టు విదిలించుకుని, నాలుక బయటికి చాచింది.

బ్రాహ్మడికి భయం చాలా భాగం తగ్గిపోయింది. "దయ్యాలు నీ కన్న రెట్టింపు పొడుగున నాలుకలు చాచటం నే నెరుగుదును," అన్నాడాయన దయ్యంతో.

దయ్యం ఈ మాటకు చిన్నబోయినట్టు కనబడి, నాలుక లోపలికి తీసుకుని, నోటి నుంచీ, చెవుల నుంచీ, రక్తం కార్చసాగింది.

"లాభం లేదే, అమ్మాయి. నీ కన్న చాలా భయంకరంగా రక్తం కార్చిన శవాలను నేను చాలా చూశాను. నువు వట్టి చేతగాని దయ్యంలా కనిపిస్తున్నావు!" అన్నాడు బ్రాహ్మడు.

దయ్యం నిరుత్సాహపడిపోయి, "అవునండీ, మీకు నిజం చెప్పేస్తాను. నాకు అనుభవం లేదు. రేపు ఆత్మహత్య చేసుకోబోతున్న ఒక ఆడపిల్ల దయ్యాన్ని నేను. ఈ ఆత్మహత్య ఎలా జరిగించాలా అని తెగ ఆలోచిస్తున్నాను. మీ దారిన మీరు వెళ్ళి




నట్టయితే నేను నిశ్చింతగా ఆలోచిస్తాను." అని బ్రాహ్మణ్ణి బతిమాలింది.

"ఓసి నీ కడుపుడకా!" అని బ్రాహ్మడు తన మనసులోనే అనుకుని, ఆత్మహత్య చేసుకోబోతున్న పిల్లమీద జాలి పడ్డాడు. ఆయన పైకి, దయ్యం మీద సానుభూతి నటిస్తూ, "బతికున్న దయ్యాన్ని నేనింత వరకు చూడలేదమ్మాయీ! పాపం, ఆ పిల్ల ఎవరో?" అన్నాడు.

"ఆ కనిపించే గ్రామంలో తూర్పువేపున ఉండే పత్రంగివాళ్ళ కోడలు," అన్నది దయ్యం.

"నిజంగానా? పాపం, ఆ పిల్లకేం కష్టం వచ్చిందో?" అన్నాడు బ్రాహ్మడు.



"ఇంకేం రావాలి? అత్తముండ కోరం టికం పెట్టి దాని ప్రాణం కొరికేస్తున్నది," అన్నది దయ్యం.

"ఇంకేం? నీకు శ్రమ లేనేలేదన్నమాట. జరగవలిసినదేదో అత్త చేతిమీదగానే జరిగి పోతుంది," అన్నాడు బ్రాహ్మడు.

"అది అంత తేలిక అనుకుంటున్నారా? నేను ఎంతో శ్రమపడి పథకం ఆలోచించాలి. ఆలోచించాను కూడా!" అన్నది దయ్యం.

"భేష్! నీ పథకం పారేనా?" అన్నాడు బ్రాహ్మడు.

"ఎందుకు పారదూ? రేపు ఆ అత్త ముండ నోము నోస్తున్నది. బుట్టెడు అరటి పళ్ళు తెప్పించింది, ముత్తయిదువులకు తాంబూలాలలో పెట్టి ఇవ్వటానికి. ఈ రాత్రి ఆ బుట్టను అటక మీద దాచేస్తాను. అప్పుడా అత్తముండ కోడల్ని నానా తిట్లూ తిడు తుంది. ఏ పాపమూ ఎరగని కోడలు కాస్తా ఆత్మహత్య చేసుకుంటుంది." అంటూ దయ్యం అమాయకంగా రహస్యం బయట పెట్టేసింది.

"ఓసి నీ కడుపుడకా!" అని బ్రాహ్మడు తనలో మళ్ళీ అనుకుని, పైకి దయ్యంతో, "బాగుంది, బాగుంది! ఇక నేను కదలాలి. కాలాతీతమై పోతున్నది. వస్తా!" అంటూ తన గ్రామానికి బయలుదేరాడు.

ఆయన ఆ రాత్రి ఇల్లుచేరి, భోజనం చేసి పడుకుని, తెల్లవారుతూనే లేచి, తూర్పు వేపున ఉండే వడ్రంగుల ఇంటికి వెళ్ళాడు. ఆయన ఇంటి బయట ఉండగానే లోపలి నుంచి పెద్దగా అరుపులూ, కేకలూ విని పిస్తున్నాయి.

బ్రాహ్మడు చల్లగా లోపలికి అడుగు పెట్టేసరికి, ఇంటావిడ ఇల్లెగిరి పోయేటట్టు కోడలి మీద అరుస్తున్నది. కోడలు నడవాలో ఒక మూల కూర్చుని వెక్కి వెక్కి ఏడుస్తున్నది.

"ఏమిటర్రా ఈ సందడీ?" అంటూ బ్రాహ్మడు లోపలికి వచ్చాడు.

"ఈ తప్పుడు ముండతో వేగలేకుండా ఉన్నాను, బాబుగారూ! నా చేత్తో నేనిక్కడ

పెట్టిన పళ్ళబుట్ట మాయమయింది. గర్భా త్రపుది అన్నీ తినేసింది. నేను ఆ మాత్రం తెలుసుకోలేని పిచ్చి మొద్దునా?'' అన్నది అత్త గుక్క తిప్పుకోకుండా.

''ఎందుకమ్మా అంతగా హైరాన పడి పోతావూ? నీ పళ్ళబుట్ట అటక మీద ఉన్నది,'' అన్నాడు బ్రాహ్మడు.

''ఇక్కడ పెట్టిన పళ్ళు అటక మీదికి వాటంతట అవి పోతాయిటండీ? అదే పెట్టాలి, లేదా ఎవరి చేతనన్నా పెట్టించాలి,'' అంటూ అత్త కోడలుకేసి కొరకొరా చూసింది.

''ముందు అటక మీద చూడవమ్మా! ఆ పళ్ళబుట్ట అక్కడ ఉన్నదీ లేనిదీ నన్ను కూడా రూఢి చేసుకోనీ!'' అన్నాడు బ్రాహ్మడు.

అటక మీద అరిటిపళ్ళబుట్ట ఉండనే ఉన్నది.

''అయితే, ఆ దయ్యం చెప్పిన మాట నిజమేనన్నమాటా!'' అన్నాడు బ్రాహ్మడు.

''దయ్యమేమిటండోయ్?'' అన్నది అత్త అనుమానంగా.

బ్రాహ్మడు తనకు దయ్యం కనిపించి తనతో మాట్లాడటం గురించి చెప్పాడు. అత్త ఆ బ్రాహ్మడి ధైర్యానికి ఆశ్చర్య పడింది. కోడలు ఏడవటం మానేసి, చిన్నగా నవ్వ నారంభించింది.

తన కృషి ఫలిస్తున్నదని గ్రహించి బ్రాహ్మడు అత్తతో, ''చూశావుటమ్మా? ఇవాళ నీ కోడలి ఆత్మహత్య వెంట్రుకవాసిలో తప్పింది. కాని నీ బుద్ధి మార్చుకోకపోతే, ఆ పిల్ల ఏదో రోజు తన ప్రాణం తీసు కుంటుంది. ఆ తరవాత నీ పాట్లు పగవాడికి కూడా వద్దనేటట్టు ఉంటాయి. తరవాత నీ యిష్టం!'' అన్నాడు.

అత్త కోడలు కేసి తిరిగి, ''నా పరువు నట్టేట కలపకే, నా తల్లీ! నీకు చందమామ కావాలన్నా తెచ్చి ఇస్తాను. అఘాయిత్యాలు మాత్రం చెయ్యకు, నీకు పుణ్యం ఉంటుంది!'' అన్నది.

ఇక ఆ కోడలికి అత్త ఆరడి ఉండ బోదని రూఢి చేసుకుని బ్రాహ్మడు తన ఇంటికి చక్కాబోయాడు.



# ఎవరి బంటు?

ఒక రోజు అక్బరు బీర్బల్‌తో షికారుకు వెళ్ళి, ఒక వంగతోట చూశారు. వంకాయలు బాగా పెరిగి, నిగనిగలాడుతూ కనిపించాయి.

"వంకాయలు చాలా బాగా ఉన్నాయి కాదూ?" అన్నాడు అక్బరు.

"చిత్తం, ప్రభూ! వంకాయ కూరలన్నిటికీ రాజులాటిది!" అన్నాడు బీర్బల్.

"ఈ వంకాయలు చూడటానికి బాగుంటాయి గాని, తింటే కసరు. కాస్త ముదిరిన వంకాయ నిండా గింజలు. నోట పెట్టుకోలేం!" అన్నాడు అక్బరు.

"అవును, ప్రభూ! వంకాయకూర ఆరోగ్యం కూడా కాదు. ఏ మాత్రం జబ్బు చేసినా వైద్యులు వంకాయ తిన నివ్వరు. అంత పాడు కూర లేదు," అన్నాడు బీర్బల్.

"ఇప్పుడే కదా వంకాయలను మెచ్చుకున్నావు?" అన్నాడు అక్బరు ఆశ్చర్యంగా.

"ప్రభూ, నేను తమ బంటును గాని, వంకాయలకు బంటును గాను!" అన్నాడు బీర్బల్ తడుముకోకుండా.

—జి. రామచంద్రరావు





# అడగని ప్రశ్న

ఒకానొక దేశంలో ఒక సరస్సుకు సమీపంగా ఒక యువకుడూ, అతని ముసలి తల్లీ ఉండేవారు. తల్లి వయసు మీరినది కావటం చేత ఏమంత శ్రమపడలేక పోయేది. కాని యువకుడు బలాఢ్యుడు, ఎంత పని అయినా చేసేవాడు. అతను ఎంత శ్రమపడినా వాళ్ళ గుడిసెలో దరిద్ర దేవత శాశ్వతంగా కాపరం పెట్టేసింది.

యువకుడు ఎవరి పొలమో కౌలుకు తీసుకుని పంట పండించేవాడు. భూస్వామికి మక్తా ధాన్యం కొలిచినాక ఆ తల్లీ కొడుకులకు ఏడాది పొడుగునా తినటానికి కూడా మిగిలేది కాదు.

"నేను ఒళ్ళు దాచుకోకుండా ఇంత శ్రమపడినా నా దరిద్రం తీర దెందుకు?" అనుకునేవాడు ఆ యువకుడు. ఎంత ఆలోచించినా ఈ ప్రశ్నకు సమాధానం దొరికేది కాదు. రాను రాను ఈ ప్రశ్న వాడి మెదడును తిని వెయ్యసాగింది. దానికి సమాధానం తెలుసుకుంటేనే గాని వాడికి నిద్రాహారాలు ఉండేటట్టు కనబడలేదు.

ఇంతలో వాడి కొక వార్త తెలియవచ్చింది. పడమటి కొండ మీద ప్రశ్నలు చెప్పే స్వామి ఉన్నాడట. ఎవరు ఏ ప్రశ్న అడిగినా ఆ స్వామి సమాధానం చెబుతాడట. యువకుడు ఆ స్వామిని అడిగి తన ప్రశ్నకు సమాధానం తెలుసుకుందామని నిశ్చయించి, తల్లితో చెప్పి, పడమటి కొండకేసి ప్రయాణమయాడు.

అతను ఏడు రోజులు ప్రయాణం చేసి, దారి పక్కన ఉన్న ఒక గుడిసె దగ్గిర ఆగి తలుపు తట్టాడు. ఒక ముసలమ్మ తలుపు తెరిచి, అతన్ని లోపలికి రమ్మని, అతను ఎక్కడికి పోతున్నదీ, ఏమి పని మీద పోతున్నదీ అడిగింది. యువకుడు సమాధానం చెప్పాడు.

ఆర్. నాగరాజు



ముసలమ్మ యువకుడికి భోజనం పెట్టి, ఆ రాత్రి అతను పడుకునేటందుకు చోటు ఇచ్చి, మర్నాడు అతను తిరిగి ప్రయాణమవుతూండగా, "చూడు, నాయనా. ఆ ప్రశ్నలస్వామి నడిగి నా ప్రశ్నకు కూడా సమాధానం తెలుసుకుంటావా? నా కూతురు చక్కని చుక్క. కాని అది ఏనాడూ మాట్లాడలేదు. దాని మూగతనానికి చికిత్స ఏమిటో కనుక్కోగలవా?" అన్నది ముసలమ్మ.

"అలాగే," అని యువకుడు మళ్ళీ దారి పట్టాడు.

అతను మరొకవారం రోజులు ప్రయాణం చేసి, అమితంగా బడలిపోయి, దారి పక్కన కనిపించిన మరొక ఇంటి తలుపు తట్టాడు.

ఆ ఇంట్లో ఉండే ముసలాయన తలుపు తెరిచి, యువకుడి స్థితి చూసి జాలిపడి, అతనికి భోజనం పెట్టించి, అతను ఎక్కడికి వెళుతున్నదీ, ఏం పని మీద వెళుతున్నదీ అడిగి తెలుసుకున్నాడు.

ఆ రాత్రికి యువకుడు ఆ ఇంటనే విశ్రాంతి తీసుకుని, మర్నాడు ఉదయం తిరిగి ప్రయాణమవుతూండగా ముసలాయన, "చూడు, నాయనా! ఆ ప్రశ్నల స్వామిని నా ప్రశ్న కూడా ఒకటి అడుగుతావా ఏమిటి? మా దొడ్లో నిమ్మచెట్టు ఏపుగా పెరిగి, నవనవలాడుతూ ఉన్నది. పూత పూస్తుంది. కాని కాయలు కాయదు. ఏం చేస్తే అది కాస్తుందో తెలుసుకు రాగలవా?" అన్నాడు.

యువకుడు అలాగేనని చెప్పి ముందుకు సాగాడు. కొన్నాళ్ళు పడమరగా నడవగా దూరాన పడమటి కొండ కాన వచ్చింది. కాని దారికి అడ్డంగా ఒక పెద్ద కొండ వాగు నురుగులు కక్కుతూ అతి వేగంగా ప్రవహిస్తూ కనబడింది. దాన్ని ఎలా దాటాలో యువకుడికి అర్థం కాలేదు. కనుచూపు మేరలో దాని మీద ఎలాటి వంతెనా లేదు.

ఏమి చెయ్యటమా అని ఆలోచిస్తూ యువకుడు ఒక బండరాతి మీద కూర్చుని ఉండగా, వాగులో నుంచి ఒక మహాసర్పం తల పైకి లేచింది. దాన్ని చూసి భయపడి

యువకుడు చప్పున నాలుగడుగులు వెనక్కు వేశాడు.

"నన్ను చూసి ఎందుకు భయపడతావు, కుర్రాడా? నేను ఎవరికీ ఎలాటి అపకారమూ చెయ్యను. నువు ఇక్కడ ఏం చేస్తున్నావు?" అని ఆ మహాసర్పం అడిగింది.

యువకుడు దానికి తన పనిగురించి చెప్పాడు.

"ఆ స్వామిని నా ప్రశ్న కూడా అడుగుదూ! నేను ఎవరికీ ఎలాటి హానీ చెయ్యలేదు గదా, వెయ్యేళ్ళుగా నేనీ వాగులో ఎందుకు బందీగా ఉన్నానో, నాకు స్వర్గప్రాప్తి ఎందుకు లేదో కనుక్కురా!" అన్నది మహాసర్పం.

"నన్ను ఈ వాగు దాటిస్తే అలాగే కనుక్కు వస్తాను," అన్నాడు యువకుడు.

మహాసర్పం అతన్ని తన మెడ మీద ఎక్కించుకుని వాగు అవతలి గట్టు మీదికి దించింది. అతను పడమటి కొండను చేరుకుని, పైకి ఎక్కాడు. కొండ మీద అతనికి ఒక అతి పురాతన నగరం కనిపించింది. నగరం మధ్య ఎత్తయిన ప్రాకారాలు గల భవనం వున్నది. ప్రశ్నలస్వామి ఎక్కడ ఉంటారని అడిగితే ఆ భవనంలోనే ఉంటారని తెలిసింది.

యువకుడికి ప్రశ్నలస్వామి వారి దర్శనం తేలికగానే లభించింది.



యువకుడు స్వామివారి ఎదట సాష్టాంగపడి, "స్వామీ, నా పక్షానా, ఇతరుల పక్షానా తమర్ని నాలుగు ప్రశ్నలు అడిగి సమాధానాలు తెలుసుకు పోదామని చాలా దూరం నుంచి వచ్చాను," అన్నాడు.

"మూడు ప్రశ్నలకు మించి సమాధానం చెప్పను. ఎవరి ప్రశ్నలైనా సరే మూడు మాత్రం అడుగు," అన్నాడు స్వామివారు.

యువకుడు కొంచెం ఆలోచించి తన ప్రశ్న అడగటం మానేసి, మిగిలిన ముగ్గురి ప్రశ్నలు మాత్రం అడిగాడు. స్వామివారు మూడింటికీ సమాధానాలు చెప్పాడు. యువకుడు మరొకసారి స్వామివారికి నమస్కారం చేసి తిరుగు ప్రయాణమయాడు.



అతను వాగు దగ్గిరికి వచ్చేసరికి మహా సర్పం అతని కోసం నిరీక్షిస్తున్నది.

"ప్రశ్నలస్వామిని అడిగి నా ప్రశ్నకు సమాధానం తెలుసుకున్నావా?" అన్నది మహాసర్పం.

"తెలుసుకున్నాను. నువు రెండు సత్కార్యాలు చేస్తే నీకు స్వర్గ ప్రాప్తి కలుగుతుందట," అన్నాడు యువకుడు.

"ఏమిటా రెండు సత్కార్యాలు?" అని మహాసర్పం అడిగింది.

"ఒకటి నన్ను వాగు దాటించడం," అన్నాడు యువకుడు.

మహాసర్పం అతన్ని వాగు దాటించి, "రెండవది ఏమిటి?" అన్నది.

"నీ నెత్తిన మణి ఉన్నదట. అది చీకట్లో ప్రకాశిస్తుందట. దాన్ని నువు విసర్జించాలి," అన్నాడు యువకుడు.

మహాసర్పం తల వంచి, "దాన్ని నువే తియ్యి," అన్నది.

యువకుడు సర్పం తల మీది మణిని పట్టుకుని ఊడలాగాడు.

వెంటనే సర్పం గంధర్వుడుగా మారి ఆకాశంలోకి ఎగిరిపోతూ, "ఆ మణిని నువే ఉంచుకో!" అని కేక పెట్టి, మబ్బుల వెనక కనబడకుండా పోయాడు.

తరవాత కొంతకాలానికి యువకుడు ముసలాయన ఇల్లు చేరుకుని, "మీ నిమ్మ చెట్టు కింద బోలెడు వెండీ, బంగారమూ పాతి ఉన్నదిటండీ. దాన్ని తవ్వి తీస్తే చెట్టు కాయలు కాస్తుందని స్వామివారు చెప్పారు," అన్నాడు.

వెంటనే ముసలాయనా, ఆయన కొడుకూ కలిసి చెట్టు కిందికి తవ్వటం మొదలు పెట్టారు. చెట్టు దిగువన నిజంగానే వెండి బంగారాలు ఉన్నాయి. కాని వాటిని బయటికి తీయటం ఆ ఇద్దరికీ సాధ్యం కాలేదు. అందుచేత యువకుడు కూడా వారికి సహాయం చేసి, ఆ నిక్షేపాన్ని ఇవతలికి లాగాడు.

ముసలాయన కృతజ్ఞతతో, "బాబూ, నీకు చాలా ఋణపడి ఉన్నాం. నువు

పట్టుకుపోగలిగినంత వెండి బంగారాలు పట్టుకుపో," అన్నాడు.

యువకుడు తాను మోయగలిగినంత వెండి బంగారాలు తీసుకుని కొద్ది రోజులకు ముసలమ్మ ఇల్లు చేరి, "మీ అమ్మాయికి తాను పెళ్ళాడే వాణ్ణి చూడగానే మాటలు వస్తాయిటమ్మా!" అన్నాడు.

అతను ఈమాట అంటున్న సమయం లోనే ముసలమ్మ కూతురు బయటికి వచ్చి, "ఎవరమ్మా, ఈ అబ్బాయి?" అన్నది.

ముసలమ్మకు కూతురి నోట మాట రాగానే పరమానందమై పోయి, "నువే దాని మొగుడివి, నాయనా! నీ వెంట తీసుకు పోయి పెళ్ళి చేసుకో," అన్నది.

యువకుడు ఆ పిల్లను వెంటబెట్టుకుని ఇంటికి వచ్చేసరికి అతని ముసలి తల్లి దౌర్భాగ్యస్థితిలో ఉన్నది. కొడుకు ఎంతకూ తిరిగి రాకపోయేసరికి, వాడు చచ్చిపోయా డనుకుని, కంటికీ మంటికీ ఏకధారగా అహోరాత్రాలు ఏడ్చి, ఆమె కళ్ళు పోగొట్టుకున్నది.

"అమ్మా, నీకు కోడలిని తెచ్చాను," అంటూ యువకుడు తాను వెంట పెట్టు కుని వచ్చిన పిల్లను ఆమె ముందుకు తోశాడు. అతని తల్లి ఆ పిల్లను దగ్గిరికి తీసు కుని, ముఖం తడివి, తలరాచి, "నా తల్లే!" అంటూ ముద్దు చేసింది.

"ఇదుగోనమ్మా, మణికూడా తెచ్చాను," అంటూ యువకుడు తాను తెచ్చిన మణిని ఆమె ముఖం దగ్గిర పెట్టాడు.

"నీ కోసం ఏడ్చి, ఏడ్చి కళ్ళు పోగొట్టు కున్నాను, నాయనా! కళ్ళు కనపడవు!" అన్నది తల్లి.

"అయ్యో, అమ్మా! నీకు కళ్ళుంటే నీ కోడలినీ, ఈ మణినీ, నేను తెచ్చిన వెండి బంగారాలనూ చూసి ఎంత సంతోషించే దానివో కదా!" అన్నాడు యువకుడు.

అతనామాట అంటుండగానే అతని తల్లికి చూపు వచ్చేసింది. ఆ మణికి కోరిన వరాలిచ్చే ప్రభావం ఉన్నట్టుస్పష్టమయింది. అందుచేత ఆ యువకుడూ, అతని భార్యా, తల్లీ ఏ లోటూ లేకుండా సుఖంగా జీవించారు.



# "నీ కన్న నయమే!"

ఒక గ్రామానికి ఒక యోగి వచ్చాడు. ఆయన ఎవరితోనూ నోరు విప్పి మాట్లాడక, మౌన స్వామి లాగా ఉండేవాడు. ఎవరన్నా తినటానికి ఇస్తే తినేవాడు, లేకపోతే లేదు.

ఆ వూళ్ళో ఉండే రామదాసు అనేవాడు ఈ యోగి సంగతి తెలిసి, ఆయనకు ఉపవాసశ్రమ లేకుండా చెయ్యటాని కని రోజూ పళ్ళు, ఫలహారమో, భోజనమో ఇస్తూ రాసాగాడు. రామదాసు రోజూ ఇచ్చే ఆహారాన్ని యోగి మౌనంగా ఆరగించేవాడు.

ఆ గ్రామంలోనే నీలకంఠశాస్త్రి ఉద్దండ పండితుడు. సకల వేదశాస్త్రాలను క్షుణ్ణంగా చదివి, ఎందరో శిష్యులు కలిగినవాడు. ఈ శాస్త్రిగారు రామదాసు రోజూ చేసే పని చూసి చాలా ఈర్ష్య పడ్డాడు. రామదాసు తన దగ్గిరే శిష్యుడుగా చేరి తనకే అవి అన్నీ అర్పించుకో రాదా అనిపించింది ఆయనకు.

చూసి చూసి శాస్త్రిగారు రామదాసుతో, "ఈ మధ్య నువ్వా పిచ్చివెధవ సేవలో పడ్డావేమిటి? వాడేం వేదాలు చదివాడా? శాస్త్రాలు చదివాడా? వాడు పట్టి దొంగ వెధవ!" అన్నాడు.

"ఏమోనండి, శాస్త్రిగారూ? నా కాయన గురించి ఏమీ తెలీదు. కాని ఒకటి నిజం, ఆ పుణ్యాత్ముడు నోరు తెరిచి ఇతరులను దూషించగా నేను వినలేదు!" అని రామదాసు తన దారిన వెళ్ళాడు.

—రాజారెడ్డి






పాండవులు సైంధవుణ్ణి పరాభవించి పంపేసి, కామ్యకవనంలో ఉంటూ ఉండగా, మార్కండేయుడు వచ్చాడు. ధర్మరాజు ఆయనతో తాము పడుతున్న కష్టాలూ, తమతోబాటు ద్రౌపది పడుతున్నపాట్లూ చెప్పి, "మహాత్మా, పూర్వం ఏ పతివ్రత అయినా ద్రౌపది లాగా కష్టాలు పడిందా?" అని అడిగాడు.

అప్పుడు మార్కండేయుడు పాండవులకు సావిత్రి కథ ఇలా చెప్పాడు:

పూర్వం మద్రదేశాన్ని అశ్వపతి అనే ధర్మాత్ముడు పాలించాడు. ఆయనకు సంతానం లేదు. అందుచేత ఆయన కఠిన నియమాలతో సావిత్రీదేవతను ఉపాసించుతూ, హోమాలు చేశాడు. చివరకు హోమకుండంలో సావిత్రీదేవి ప్రత్యక్షమై ఏమి కావాలని అడిగింది.

దానికి అశ్వపతి, "దేవీ, వంశోద్ధారకులైన కొడుకులు కావాలి," అన్నాడు.

"రాజా, నీ కోరిక తెలిసి, నేను ముందుగానే బ్రహ్మను అడిగాను. ఆయన నీకు ఒక కూతుర్ని ఇవ్వటానికి మాత్రమే సమ్మతించాడు. కనక నువు అదే మహాప్రసాదంగా భావించి, తృప్తిపడు," అని చెప్పి సావిత్రీదేవి అదృశ్యమయింది.

అశ్వపతి తపస్సు చాలించి, నగరానికి తిరిగివచ్చి, యథాప్రకారం రాజ్యం చేస్తూ ఉండగా, ఆయన భార్య మాళవి గర్భవతి అయి, ఒక శుభముహూర్తాన చక్కని ఆడపిల్లను కన్నది. అశ్వపతి ఆమెకు జాత

## 36. సావిత్రీ సత్యవంతుల కథ



కర్మలు జరిపించి, అమెకు సావిత్రి అని నామకరణం చేశాడు.

సావిత్రి ఎంతో గారాబంగా పెరుగుతూ, నానాటికీ అందంలో మించిపోతూ, చూసే వారికి ఏ దేవతా స్త్రీయో, సావిత్రీదేవే స్వయంగా మనిషి జన్మ ఎత్తిందేమోనని భ్రమ కలిగేటట్టుగా తయారయింది.

ఒకనాడు అశ్వపతి అమెతో, "అమ్మా, నీకు పెళ్ళియీడు వచ్చింది. ఏ కారణం చేతనో రాజకుమారుడు ఒక్కడు కూడా నిన్ను పెళ్ళాడతానని రావటం లేదు. నీకు తగిన భర్తను నువ్వయినా వరించి నాకు చెప్పు. నేను నిన్ను అతనికి ఇచ్చి నా ధర్మం నెరవేర్చుకుంటాను," అన్నాడు.

సావిత్రి తన భర్త కాదగిన వాడికోసం వెతుకుతూ రథమెక్కి రాజర్షులుండే ఆశ్రమాల వెంబడి బయలుదేరింది.

సావిత్రి అలా తిరుగుతూ ఉండగా ఒకనాడు అశ్వపతి వద్దకు నారదమహాముని వచ్చి, లోకవార్తలు చెప్ప నారంభించాడు. నారదుడు ఉండగానే సావిత్రి తన పర్యటన పూర్తి చేసుకుని, ఇంటికి తిరిగి వచ్చింది. అమె తన తండ్రికీ, నారదుడికీ నమస్కరించి నిలబడేసరికి నారదుడు అశ్వపతితో, "రాజా, నీ కూతురు ఎక్కడికి వెళ్ళి వస్తున్నది? యుక్తవయస్కురాలైన ఈ పిల్లకు ఇంకా వివాహం చేశావుకావేం?" అని అడిగాడు.

"మునీంద్రా, ఈమెను భర్తను వెతుక్కురమ్మని పంపాను. ఎవరిని వరించి వచ్చిందో అడిగి తెలుసుకోవాలి," అంటూ అశ్వపతి తన కూతురితో, "అమ్మా, నువు వెళ్ళిన పని అయిందా?" అన్నాడు.

సావిత్రి తండ్రితో ఇలా అన్నది:

"చాలా కాలంగా సాళ్వదేశాన్ని ఏలిన ద్యుమత్సేనుడనే మహారాజుకు వార్ధక్యంలో ఒక కొడుకు పుట్టాడు. ద్యుమత్సేనుడికి దురదృష్టవశాన గుడ్డితనం సంప్రాప్తమయింది. అది ఆధారం చేసుకుని, ద్యుమత్సేనుడికి పూర్వం ఓడిన శత్రువులు ఆయన రాజ్యాన్ని కాజేశారు. ఆ ముసలిరాజు తన

ముసలి భార్యనూ, పసికొడుకునూ వెంట బెట్టుకుని అరణ్యాలలో ఉంటూ తపస్సు చేసుకుంటున్నాడు. పసితనం నుంచీ ఆశ్రమాలలో పెరిగిన ద్యుమత్సేనుడి కొడుకు మునికుమారుడి లాగా పెరిగి, క్రూరబుద్ధి ఏమాత్రమూ లేక, ఎప్పుడూ నిజంచెబుతూ, సత్యవంతు డని పేరు తెచ్చుకున్నాడు. నేను ఆ సత్యవంతుణ్ణి నా భర్తగా వరించి తిరిగి వచ్చాను."

ఈ మాట వినగానే నారదుడు, "అయ్యో, పాపం! సావిత్రి తెలియక ఆ కుర్రవాణ్ణి భర్తగా వరించింది," అన్నాడు.

అప్పుడు అశ్వపతి, "మునీశ్వరా, మీకు తెలియనిదంటూ లేదు. ఈ సత్యవంతుడు ఎలాటివాడు? అతని గుణమూ, రూపమూ, శీలమూ ఎలాటివి?" అని అడిగాడు.

దానికి నారదుడు, "రాజా, ద్యుమత్సేనుడి కొడుకు తన తల్లి దండ్రులలాగే సత్యవ్రతుడు. అతను గుర్రాల బొమ్మలు చాలా బాగా తయారు చేస్తాడు. అందుచేత అతన్ని చిత్రాశ్వు డని కూడా పిలుస్తారు. అతని అందచందాలు అశ్వినీదేవతలకు తీసిపోవు. సకల సద్గుణ సంపన్నుడు. కాని అతని ఆయువు ఇంకొక్క ఏడాది మాత్రమే ఉన్నది. ఇవాళ నుంచి సరిగా ఏడాది గడిచే సరికి అతని జీవితం ముగిసిపోతుంది," అన్నాడు.



ఈ మాటకు అశ్వపతి కలతపడి, "అమ్మా, ఈ అల్పాయుష్కుణ్ణి విడిచి మరెవరినైనా వరించు," అన్నాడు.

"ఒకసారి త్రికరణశుద్ధిగా ఒకరిని వరించిన తరవాత, అతను అల్పాయువైనా, దీర్ఘాయువైనా, శీలవంతుడైనా, దుశ్శీలుడైనా మరొకరిని వరించటం సాధ్యం కాదు. నేను సత్యవంతుణ్ణి వదిలేసి మరొకరిని వరించను. నన్ను అతనికే ఇచ్చి పెళ్ళిచెయ్యి," అన్నది సావిత్రి తండ్రితో.

నారదుడు కూడా అశ్వపతితో, "రాజా, నీ కుమార్తె దృఢనిశ్చయం గలది. ఆమె మనసు మార్చటం నీవల్ల కాదు. నన్నడిగితే ఈనాటి రాజులలో సత్యవంతుడికి సమాన



కిచ్చి పెళ్ళి చేయ నిశ్చయించి వచ్చాను. దీనిని నీ కోడలుగా స్వీకరించు," అన్నాడు.

"రాజా, మేము రాజ్యం పోగొట్టుకుని, ఈ అరణ్యంలో జీవిస్తున్నాము. నీ కుమార్తె సుకుమారి. మాతో కష్టాలు పడగలదా?" అన్నాడు ద్యుమత్సేనుడు.

"సుఖ దుఃఖాలు మనిషి అధీనంలో ఉండేవి కావు. ఆ మాట నా కుమార్తెకు తెలుసు. కష్టసుఖాలను గురించి ఆలోచించే వచ్చాము. నా కూతురూ, నీ కొడుకూ ఒకరికొకరు తగినవారు. మనం వియ్యం అందుదాం," అని అశ్వపతి అన్నాడు.

ద్యుమత్సేనుడు సంతోషించి, తన ఆశ్రమంలో ఉన్న మునులందరినీ చేరబిలిచి, మంచి ముహూర్తంలో సావిత్రీ సత్యవంతుల వివాహం జరిపించాడు. అశ్వపతి తన నగరానికి తిరిగి వెళ్ళాడు.

తన తండ్రి తిరిగి వెళ్ళగానే సావిత్రి తన మేలివస్త్రాలూ, ఆభరణాలూ తీసేసి, భర్తతోబాటు తాను కూడా నారచీరలు కట్టి, శరీరశ్రమ లక్ష్యపెట్టకుండా అత్త మామలకూ, భర్తకూ అన్నివిధాలా సేవలు చేస్తూ, మితభాషిణి అయి కాలం గడపసాగింది.

కాని ఆమె తన భర్త ఆయువు ఒక్కొక్క రోజే తరిగిపోవటం లెక్క పెడుతూనే ఉన్నది. నారదుడు చెప్పిన ప్రకారం సత్యవంతుడి ఆయుర్దాయం ఇంకా నాలుగు

మని చెప్పగలవాడు ఎవడూ లేడు. సావిత్రిని అతని కిచ్చి చెయ్యి. ఆమె సుకృతం మంచిదైతే సత్యవంతుడు దీర్ఘాయువు కావచ్చు. శుభమస్తు!" అని చెప్పి స్వర్గానికి వెళ్ళిపోయాడు.

నారదుడు చెప్పిన ప్రకారం అశ్వపతి తన కుమార్తెను సత్యవంతుడి కిచ్చి పెళ్ళి చేయ నిశ్చయించి, సావిత్రిని వెంట బెట్టుకుని బంధుమిత్ర పరివారసహితంగా ద్యుమత్సేనుడి ఆశ్రమానికి వెళ్ళాడు.

ముసలివాడూ, వృద్ధుడూ అయిన ద్యుమత్సేనుడు ఒక మద్దిచెట్టు నీడన కూర్చుని ఉన్నాడు. అశ్వపతి ఆయనతో, "మహారాజా, నా కుమార్తెను సావిత్రిని నీ కుమారుడి

రోజులు ఉన్నదనగా ఆమె త్రిరాత్రోపవాసం ప్రారంభించింది.

"అమ్మా, అసలే సుకుమారివి. ఇలాటి వ్రతం ఎందుకు ప్రారంభించావు? నిన్ని కఠోరవ్రతం మానమనటానికి నాకు నోరు రాకుండా ఉన్నది." అని ద్యుమత్సేనుడు సావిత్రితో అన్నాడు.

"దృఢనిశ్చయం ఉండాలేగాని, ఎంత కఠినమైన పనులైనా నిర్విఘ్నంగా సాగించవచ్చు. నేను దృఢనిశ్చయంతోనే ఈ వ్రతం ప్రారంభించాను," అన్నది సావిత్రి.

సావిత్రికి ఉపవాసశ్రమ కన్న తన భర్తకు చావు రానున్నదన్న దిగులు జాస్తి అయింది. మూడు రాత్రులూ గడిచాయి. నారదుడు చెప్పిన ప్రకారం సత్యవంతుడి జీవితంలో అఖరు రోజు తెల్లవారింది.

ఆ రోజు సావిత్రి తెల్లవారుతూనే లేచి, సూర్యోదయం కాగానే అగ్ని ప్రజ్వలింప జేసి, హోమం చేసి, ఆశ్రమంలో ఉన్న అత్త మామలకూ, మిగిలిన పెద్దలకూ నమస్కారాలు చేసి, "దీర్ఘసుమంగలీ భవ!" అని ఆశీస్సులు పొంది, భర్తకు రాబోయే మరణం గురించి ఆలోచిస్తూ దిగులుగా కూర్చున్నది.

"అమ్మా, నీ వ్రతం పూర్తి అయింది గదా, పారణ చెయ్యవేం?" అని అత్త మామలు సావిత్రిని అడిగారు.



"ఈ వ్రతానికి సూర్యాస్తమయం అయిన తరవాతనే పారణ చెయ్యాలి," అని సావిత్రి బదులు చెప్పింది.

సత్యవంతుడు సమిధలనూ, పూలనూ, పళ్ళనూ తీసుకురావటానికి గొడ్డలి భుజాన పెట్టుకుని, అరణ్యంలోకి బయలుదేరుతున్నాడు. అప్పుడు సావిత్రి అతన్ని సమీపించి, "నేనూ వస్తాను. ఇవాళ నిన్ను విడిచి ఉండ బుద్ధి కావటంలేదు," అన్నది.

"పిచ్చిదానా, అడవి ఎలా ఉంటుందో నీకు తెలీదు. అక్కడి బాటల నిండా రాళ్ళూ, ముళ్ళూ ఉంటాయి. అదీగాక మూడు రోజులుగా ఉపవాసం ఉండి బడలి ఉన్నావు." అన్నాడు సత్యవంతుడు.



" ఉపవాసంచేత నా కేమీ బడలిక లేదు. ఎందుకో నా కివాళ అరణ్యంలో తిరగాలని పించింది. అభ్యంతరం చెప్పవద్దు," అన్నది సావిత్రి.

"నీ యిష్టం. కాని మా అమ్మా, నాన్నా ఒప్పుకుంటే అలాగే నా వెంట రా. తప్పు నా మీద ఉండదు," అన్నాడు, సత్యవంతుడు.

సావిత్రి మామగారికి తన కోరిక తెలిపింది. "నేను వచ్చి దాదాపు సంవత్సరం కావస్తున్నది. అరణ్యం చూడాలన్న నా కోరిక తీరలేదు. ఇవాళ నన్ను నా భర్త వెంట వెళ్ళనివ్వండి," అని ఆమె అడిగింది. ఎన్నడూ ఏ కోరికా కోరినది కాదుగదా అని, ద్యుమత్సేనుడు సావిత్రిని సత్యవంతుడి వెంట వెళ్ళమన్నాడు.

అత్తమామల అనుమతితో సావిత్రి, కడుపులో పుట్టెడు దిగులు ఉన్నా, పైకి ఎంతో ఉల్లాసంగా కనబడుతూ, సత్యవంతుడి వెంట అరణ్యంలోకి బయలు దేరింది. సత్యవంతుడు అరణ్యంలోని అందాలను చూపుతూ నడుస్తూ ఉంటే సావిత్రికి అతను అప్పుడే చచ్చిపోయినట్టే అనిపించ సాగింది.

సత్యవంతుడు బుట్టనిండా పూలూ, పళ్ళూ కోసి, కట్టెలు కొట్టటం ప్రారంభించాడు. అతనికి కొద్దిసేపట్లో ఆయాసం వచ్చింది. ఒళ్ళంతా చెమటలు పట్టాయి. అతను గొడ్డలి అవతల పడేసి, సావిత్రి దగ్గిరికి వచ్చి, "తల పగిలిపోతున్నది. శరీరం తూలుతున్నది. నిలబడలేకుండా ఉన్నాను. కాస్సేపు పడుకుంటాను," అన్నాడు.

సావిత్రి అతని తల పెట్టుకోవటానికి తన తొడ ఇచ్చి, పడుకోనిచ్చింది. కొంతసేపటికి సత్యవంతుడి సమీపంలో సావిత్రికి ఒక ఆకారం కనబడింది. ఆ వ్యక్తి నల్లగా, ఎర్రని కళ్ళు కలిగి, నీలవస్త్రాలు ధరించి, చేతిలో పాశం పట్టుకుని, చూడటానికి భయంకరుడుగా ఉన్నాడు.

అతన్ని చూస్తూనే సత్యవంతుడి తలను తన తొడమీది నుంచి తీసి కిందపెట్టి, లేచి

నిలబడి, నమస్కారం చేసి, "అయ్యా, నువు ఎవరు? ఎందుకు వచ్చావు?" అని అడిగింది సావిత్రి.

"అమ్మా, నేను యముణ్ణి. నువు పతి వ్రతవు గనక నన్ను చూడ గలిగావు. సత్య వంతుడికి ఆయువు ముగిసింది. అతను గొప్ప ధార్మికుడు గనక అతని కోసం దూత లను పంపక, నేనే స్వయంగా వచ్చాను," అంటూ యముడు తన పాశంతో సత్య వంతుడి శరీరం నుంచి బొటనవేలి ప్రమా ణంలో ఉన్న జీవుణ్ణి లాగి, దక్షిణంగా బయలుదేరాడు.




సావిత్రి తన భర్త శరీరాన్ని భద్రపరచి, యముడి వెంట బయలుదేరింది. యము డామెను తిరిగి పొమ్మన్నాడు. కాని సావిత్రి తన భర్త ఎక్కడికి పోతే తాను కూడా అక్కడికి పోతానన్నది, అది తన ధర్మ మన్నది.

యముడు సంతోషించి సావిత్రితో, "నీ భర్త ప్రాణాలు తప్ప మరేదన్నా వరం కోరుకో," అన్నాడు.

"మా మామగారు ముసలివాడూ, గుడ్డి వాడూ అయాడు. ఆయనకు చూపూ, శరీర బలమూ ప్రసాదించు," అన్నది సావిత్రి. యముడు సరేనన్నాడు.

కాని సావిత్రి యముణ్ణి అనుసరించటం మానలేదు. ఆమెను వదిలించుకోవటానికి యముడు ఆమెను మరొక వరం కోరుకో మన్నాడు.

సావిత్రి రాజ్యం కోల్పోయిన తన మామ గారికి తిరిగి రాజ్యప్రాప్తి కలగాలని వరం కోరింది. యముడు సరే నన్నాడు.

అప్పటికీ ఆమె యముడి వెంట పోవటం మానలేదు. యముడు ఆమెను మరొక వరం కోరమన్నాడు. సావిత్రి తన తండ్రికి పుత్ర సంతానం కోరింది. యముడు అశ్వ పతికి నూరుగురు కొడుకులు కలిగేలాగు వరం ఇచ్చాడు.

అయినా సావిత్రి తిరిగి పోవటం లేదని గమనించి యముడు ఆమెకు నాలుగోవరం ఇస్తానన్నాడు. సావిత్రి తనకూ, సత్యవంతు

డికీ వంశవృద్ధి అయేటట్టు నూరుగురు కొడుకులను ప్రసాదించమన్నది.

"నీకు నూరుగురు కొడుకులు పుడతారు. ఇక తిరిగి వెళ్ళు," అన్నాడు యముడు.

"అలా అయితే నా భర్త ప్రాణాలు తిరిగి ఇచ్చెయ్యి," అన్నది సావిత్రి.

యముడు సత్యవంతుడి ప్రాణాలు వదిలేసి వెళ్ళిపోయాడు. సావిత్రి తన భర్త శరీరం ఉన్నచోటుకు తిరిగి వచ్చి, అతని తలను తన తొడల మీద పెట్టుకుని కూర్చున్నది. కొంతసేపటికి సత్యవంతుడు కళ్ళు తెరిచి సావిత్రి ముఖంలోకి చూసి, "నేను చాలాసేపు నిద్రపోయానా? నన్నెవరో నల్లని వాడు చాలాదూరం తీసుకుపోయినట్టు కల వచ్చింది," అన్నాడు.

"అదంతా తరవాత చెబుతాను. చీకటి పడుతున్నది. నువు లేచి నడపగలిగితే మనం ఆశ్రమానికి పోదాం," అని సావిత్రి అన్నది.

అతన్ని సావిత్రి లేపి నిలబెట్టవలిసి వచ్చింది. బుట్టను మోసే శక్తి అతనికి లేదు. దాన్ని ఒక చెట్టుకొమ్మకు తగిలించి, సావిత్రి మెల్లిగా అతన్ని నడిపించుకుంటూ, వెన్నెలలో దారి చూసుకుంటూ ఆశ్రమానికి చేర్చింది.

ఆశ్రమంలో అకస్మికంగా చూపు వచ్చిన ద్యుమత్సేనుడు, చీకటి పడినా కొడుకూ కోడలూ తిరిగి రానందున ఆందోళనపడి తన భార్యతో సహా, కొడుకు కోడళ్ళను పేరెత్తి పిలుస్తూ, అరణ్యం కేసి బయలు దేరాడు. ఇంతలో సావిత్రీ సత్యవంతులు రానే వచ్చారు. ఈ సరికే ఆశ్రమంలో అనేక మంది చేరారు. సావిత్రి వారందరికీ జరిగినదంతా చెప్పింది.

యముడి వరాలు వృథా కాలేదు. ద్యుమత్సేనుడికి రాజ్యం తిరిగి వచ్చింది. అశ్వపతికి కొడుకులు కలిగారు. సావిత్రీ సత్యవంతులకు కూడా కొడుకులు పుటారు.

మార్కండేయుడు పాండవులకు ఈ కథ చెప్పి, "ద్రౌపది పాతివ్రత్యం వల్ల మీ కష్టాలు తొలగి పోతాయి," అని చెప్పి, తన దారిన తాను వెళ్ళాడు.





# శివపురాణం

## 13

తారకుణ్ణీ, అతనితో బాటు అనేకమంది ఇతర రాక్షసులనూ చంపిన అనంతరం కుమారస్వామి కొంతకాలం స్వర్గంలోనే ఉండి, పార్వతీ పరమేశ్వరులను సేవించాలని బుద్ధిపుట్టి కైలాసానికి వచ్చి, అక్కడ ఉండిపోయాడు.

ఆ కాలంలో అతను తన స్నేహితులతో కలిసి ఒకనాడు వనవిహారం చేస్తూ ఉండగా అతని వద్దకు నారదమహాముని వచ్చాడు. కుమారస్వామి నారదుడికి అతిథిసత్కారాలు చేసి, "మునీశ్వరా, లోకాలలో విశేషాలేమిటి?" అని అడిగాడు.

"నీ దయవల్ల అన్ని లోకాలవారూ సుఖంగా ఉన్నారు. రాక్షసులను చంపేశావు గనక యజ్ఞయాగాదులు చక్కగా జరుగుతున్నాయి. అయితే నీకు ఒక విషయం చెప్పటానికి వచ్చాను. ఈ సమీపంలోనే భిల్లుపురం అనే గ్రామం ఉన్నది. అక్కడ పుళిందు డనే భిల్లురాజు ఉన్నాడు. అతను ఈశ్వర భక్తుడు. అతనికీ, అతని భార్యకూ చాలా కాలం సంతానం కలగలేదు. ఇలా ఉండగా ఆ భిల్లురాజుకు వనంలో ఒక ఆడపిల్ల దొరికింది. అతను ఆ పిల్లను తెచ్చి తన భార్యకిచ్చాడు. ఆ దంపతులు ఆ పిల్లకు వల్లి అని పేరుపెట్టి అతిగారాబంగా పెంచారు. వల్లి అందచందాలు వర్ణించటం నాతరం కాదు. బంగారు బొమ్మ! చూడగానే వనలక్ష్మి అనిపిస్తుంది! ఆమె నీకు భార్య అవుతుందని బ్రహ్మదేవుడు మాటల సందర్భంలో నాతో అన్నాడు. అందుచేత నువు ఆమెను పెళ్ళి చేసుకుని సుఖపడు," అన్నాడు నారదుడు.

తరవాత నారదుడు కుమారస్వామి వద్ద సెలవు తీసుకుని భిల్లురాజైన పుళిందుడి

అట్ట చివరి బొమ్మ



వద్దకు వెళ్ళాడు. పుళిందుడు ఆయనను గౌరవించి కూర్చోబెట్టి, "మునీశ్వరా, మా వల్లికి తగిన గుణరూపాలు గల భర్త ఎక్కడ దొరుకుతాడో సెలవివ్వండి?" అని అడిగాడు.

"ఈ పిల్లకు తగినవరుడు శివుడి కొడుకైన కుమారస్వామి మాత్రమే. అతనికి కూడా వల్లి కన్న తగిన భార్య దొరకదు. త్వరలోనే కుమారస్వామి వనవిహారానికి వచ్చి, వల్లిని చూసి మోహిస్తాడు. అతను మీకు అల్లుడవుతాడు. మీరు ధన్యులు. శివుడు వియ్యంకుడు కావటంకన్న మహాభాగ్యం ఏ మున్నది?" అని పుళిందుడితో అని నారదుడు వెళ్ళిపోయాడు.

నారదుడు వల్లి సౌందర్యం గురించి చెప్పిపోయినది మొదలు కుమారస్వామి మనసులో ఆరాటం బయలుదేరింది. ఆమెను పెళ్ళాడాలన్న కోరిక అతనిలో తల ఎత్తింది. భిల్లు కన్యను పెళ్ళాడతానంటే తల్లిదండ్రులు ఒప్పుకుంటారో లేదో అనుకున్నాడు అతను. ఏ నిర్ణయం చెయ్యటానికైనా ముందు తాను ఆమెను కళ్ళారా చూడటం అవసరం అని అతనికి తోచింది. అందుకని అతను తన పరివారాన్ని వెంట బెట్టుకుని, భిల్లుపురం సమీపంలో వనవిహారం చెయ్యసాగాడు.

నారదుడి మాటలు కుమారస్వామిని కలత పెట్టినట్టే వల్లిని కూడా కలత పెట్టాయి. కుమారస్వామి ఎప్పుడు వస్తాడా అని ఆమె ఆత్రంగా ఎదురుచూస్తున్నది. అతను తన వంటి నీచకన్యను పెళ్ళాడతాడా అని సందేహిస్తున్నది. తన తల్లిదండ్రులు తనను పెంచుకున్న వారేగాని కన్నవారు కారుగదా అని తన మనస్సును సమాధాన పరుచుకుంటున్నది. కుమారస్వామి తనను పెళ్ళాడకపోతే దేహత్యాగం చెయ్యటానికైనా ఆమె సిద్ధంగా ఉన్నది.

ఇలా అనుకున్నాక వల్లి తన తల్లిదండ్రులకు చెప్పకుండా, కొందరు చెలికత్తెలను వెంట బెట్టుకుని వనవిహారానికి బయలుదేరి వెళ్ళింది. ఆమె తన చెలికత్తెలతో సహా ఒక



గున్నమామిడి చెట్టు కింద కూర్చుని ఉండగా, కుమారస్వామి తన అనుచరులతో వచ్చి, సమీపంలోనే మరొక చెట్టు కింద కూర్చున్నాడు.

వల్లి చెలికత్తె ఒకతె అతని వద్దకు వచ్చి, "అయ్యా, మీరెవరు? ఎక్కడినుంచి వచ్చారు? ఈ పుష్పవనం పుళిందరాజు కుమార్తె అయిన వల్లీదేవి విహారస్థలం. ఈ ప్రదేశానికి మగవాళ్ళు రాకూడదు," అన్నది.

ఈ మాటలు వినగానే కుమారస్వామికి కొత్త ఉత్సాహం వచ్చింది. అతను వల్లి చెలికత్తెతో, "నాపేరు కుమారస్వామి. నేను శివపార్వతుల కుమారుణ్ణి. మాది కైలాసం. మీ వల్లి సమాచారం వినదగినదైతే చెప్పు," అన్నాడు.

"ఈ పుళిందదేశానికి రాజైన పుళిందుడు భిల్లులకు రాజు. భిల్లుపురం ఆయన రాజధాని. ఆయన ఈశ్వరభక్తుడు. ఆయనకు పిల్లలు లేరు. ఈ వనంలోనే ఆయనకు వల్లి దొరికింది. ఆయనా, ఆయన భార్యా ఆ పిల్లను పెంచుకుని పెద్ద దాన్ని చేశారు," అని చెలికత్తె చెప్పింది.

"మీ వల్లికి వివాహం అయిందా?" అని కుమారస్వామి అడిగాడు.

"సంబంధం కుదిరింది. పెళ్ళికావటమే తరవాయి," అన్నది చెలికత్తె.

కుమారస్వామి ఆత్రంగా, "ఏమిటా సంబంధం? వరుడు ఎవరు?" అని అడిగాడు.

"నిన్న మా రాజుగారి దగ్గిరికి నారద మహాముని వచ్చాడు. శివుడి కుమారుడైన కుమారస్వామి వచ్చి వల్లిని పెళ్ళాడతాడని ఆయన మా రాజుగారితో చెప్పి వెళ్ళాడు. అది మొదలు మా వల్లి కుమారస్వామి కోసం కలవరిస్తున్నది. ఆవిడగారికి క్షణ మొక యుగంగా ఉన్నది. ఆమె బాధ చూడలేక వనవిహారానికి తీసుకు వచ్చి ఆ మామిడి చెట్టు కింద కూర్చోబెట్టాం. నువు ఇక్కడే ఉండు. వల్లిని తీసుకువస్తాను," అంటూ చెలికత్తె వెళ్ళి, వల్లిని చెయ్యిపట్టుకుని లాక్కొచ్చింది.

కుమారస్వామి వల్లి చెయ్యి పట్టుకుని, "నా వెంట వచ్చెయ్యి. మనం పెళ్ళి చేసుకుందాం," అన్నాడు.

"నన్ను పెళ్ళి చేసుకోదలిస్తే నా తల్లిదండ్రుల అనుమతి పొందాలి. లోకనింద తెచ్చుకునే పనులు చేయరాదు. కాస్సేపు ఇక్కడే ఉండు. మన పెళ్ళికి మావాళ్ళ అనుమతి పొందివస్తాను," అంటూ వల్లి చెయ్యి విడిపించుకుని, తన చెలికత్తెలతో సహా ఇంటికి వచ్చేసింది.

జరిగిన సంగతి తెలిసి పుళిందుడు సపరివారంగా కుమారస్వామి వద్దకు వచ్చి, ఆ రాత్రి తెల్లవారు ఝామున లగ్నం ఉన్నదని చెప్పి, అతన్నీ, అతని పరివారాన్నీ వెంట బెట్టుకుపోయి, విడుదులలో ఉంచి, పెళ్ళి ప్రయత్నాలు చెయ్యటానికి ఇంటికి వెళ్ళాడు.

ఈ వార్త తెలిసి పార్వతీ శివులు కైలాసం నుంచి వచ్చి, కుమారస్వామి వివాహం జరిపించి, వధూవరులతో సహా కైలాసానికి తిరిగి వెళ్ళారు.

కొంతకాలం గడిచింది. శోణితపురంలో గజాసురుడు అనే వాడొకడు అవతరించాడు. వాడు కూడా బ్రహ్మను గురించి ఘోరమైన తపస్సు చేసి, అనేక వరాలుపొంది, మూడు లోకాలనూ స్వాధీనం చేసుకుని ఏలసాగాడు. పరమ శివభక్తుడైన గజాసురుడి పాలనలో ప్రజలందరూ సర్వసుఖాలూ అనుభవించారు. వారికి ఎలాటి ఈతి బాధలూ లేవు.

ఒకనాడు నారదుడు గజాసురుడి వద్దకు వెళ్ళి, అతడి చేత అతిథిమర్యాదలు పొంది, "గజా, నువు గొప్ప ఈశ్వరభక్తుడవు. శివుణ్ణి నీ హృదయంలోనే ఉండమని కోరరాదా?" అన్నాడు.

గజాసురుడికి ఈ ఆలోచన నచ్చింది. అతను తన పూజతో శివుణ్ణి ప్రత్యక్షం చేసుకుని, తన హృదయం లోనే ఉండమని వరం కోరాడు. శివుడు అందుకు సమ్మతించి, లింగరూపంలో గజాసురుడి హృదయంలో ఉండిపోయి, గజాసురుడి మానసిక పూజలు అందుకోసాగాడు.



# 123. స్వయంభూనాథాలయం, నేపాలు

ఇది నేపాలు రాజధాని అయిన కాట్మండు నగరంలోని ఒక బౌద్ధచైత్యము. ఇందులో స్వయంభూనాథు డనే ఒక సిద్ధుడి అస్థికలు నిక్షేపించి ఉన్నాయి. పైన ఉన్న గొడుగు బంగారుపూత గలది.



Photo by Shantaram R. Shinde



బహుమతి
పొందిన వ్యాఖ్య

జాతీయపక్షిని నేను

పంపినవారు :
ఎస్. వేంకటాచార్య

Photo by Nivas G. Jadhav



16-7-813/1, సాహిఫ,
హైదరాబాదు-24

తలవంచేదానను కాను

బహుమతి
పొందిన వ్యాఖ్య

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 20 లు







★ వ్యాఖ్యలు ఫిబ్రవరి నెల 20 వ తేదీ లోగా చేరాలి.

★ వ్యాఖ్యలు ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలోగాని వుండాలి. రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి. గెలుపొందిన వ్యాఖ్యలు ఏప్రిల్ సంచికలో ప్రకటించబడును.

# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



రెండవ అట్ట:
రష్యన్ సర్కస్ - 1

మూడవ అట్ట:
రష్యన్ సర్కస్ - 2


**Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Chandamama Publications, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'**

ఎదగటానికి
టానిక్
నివ్వండి



ఆరోగ్యానికి
పోషక ఆహార
మివ్వండి






# షార్కొఫెర్రాల్ నివ్వండి

**అందులో రెండూ ఉన్నాయి ! విటమిన్లు, ఖనిజములు మరియు మాల్ట్‌ల పటిష్టమైన మిశ్రమం**

షార్కొ—ఫెర్రాల్ టానిక్ మరియు పోషక ఆహారం కావటంచేత ఎదగటానికి మరియు ఆరోగ్యానికి చాలా శ్రేష్టమైనది. ప్రతి స్పూను షార్కొ—ఫెర్రాల్, ఏ ఇతర టానిక్ లేక పోషక ఆహారానికన్నా కూడా ఎక్కువగా విటమిన్స్ ఎ. డి మరియు అత్యావశ్యక మైన బి కాంప్లెక్స్ పదార్థములను ఇస్తుంది. ముఖ్యమైన ఐరన్ మరియు కాల్షియమ్‌లవంటి ఖనిజములను కూడా సమకూర్చుతుంది. 40 సంవత్సరాలుగా డాక్టర్లు షార్కొ—ఫెర్రాల్‌ను సిఫారసు చేయటంలో ఆశ్చర్యం లేదు జలుబులు మరియు సూక్ష్మ జీవులద్వారా సాధారణంగా సంక్రమించే అస్వస్థల నుండి కూడా కాపాడుతుంది..

1 కెజి. మరియు 460 గ్రాములు జార్ లలో లభిస్తున్నది.

షార్కొ—ఫెర్రాల్
భారతదేశపు అత్యంత నమ్మకమైన
అధికంగా అమ్ముడయ్యే మాల్ట్ కలిగిన టానిక్!




అలెంబిక్ కెమికల్ వర్క్స్ కొ. లి.
నాణ్యమైన మందులకు నమ్మకమైన పేరు.

everest/206/ACW TL

# చందాదారులకు గమనిక

'చందమామ' కాపీలు పంపుటకు మీ చిరునామాలో ఏదైనా మార్పుంటే 5-వ తేది లోగానే, మీ చందా నంబరు ఉదహరిస్తూ, మాకు తెలపాలి. ఆలస్యమైతే మళ్ళీ నెల వరకు మీ కొత్త అడ్రసును అమలు పెట్టడానికి వీలుండదు.

డాల్టన్ ఏజన్సీస్
'చందమామ బిల్డింగ్స్'
మదరాసు - 26

## టీవీయస్ రీట్రెడులు భద్రత నిస్తాయి

టివియస్ రిట్రెడ్‌లు క్రొత్త టైరులులాగే కన్పిస్తాయి. రిట్రెడింగ్ విధానంలో ప్రత్యేకంగా మేము తీసుకొనే జాగ్రత్తలు క్రొత్త టైరులులాగ కన్పించడానికిగాదు. క్రొత్త టైరులాగ మంచి రోడ్డు గ్రిప్పును ఇచ్చేటట్లు చూస్తాము. అవి చాలాకాలం క్రొత్తవిలాగ మన్నుతాయి.

టివియస్‌కు ఇచ్చే ప్రతి టైరూ కూడా ట్రెడ్‌ను వదులుచేసే ఇసుక రేణువులు లేక సున్నితమైన ఇతర బాహ్య పదార్థాలు లేకుండా ఒకసారి, రెండుసార్లు పరీక్ష చేయబడుతుంది.

అత్యాధునికమైన రిట్రెడింగ్ మెషినులమీద మంచి నైపుణ్యతగల సాంకేతిక సిబ్బంది పనిచేస్తారు. మీకు తెలుసా బాగా మన్నడానికని టివియస్ క్యామెల్ బ్యాక్ రబ్బరును వారే తయారుచేసుకుంటారు. ఆశ్చర్యములేదు టివియస్ రిట్రెడులు ఇతర వాటికంటె మీరు చెల్లించే ప్రతి రూపాయికి అధికంగా టైరు మైళ్లనిస్తాయి.

మీరు టివియస్‌ను విశ్వసించవచ్చు—భారతదేశంలో పెద్ద రిట్రెడ్ వ్యాపారస్థులు.






**సుందరమ్ ఇండస్ట్రీస్ ప్రైవేట్ లిమిటెడ్**

బెంగళూరు-కోయంబత్తూరు-కలమసేరి-మద్రాసు-మదురై-సేలం-సికింద్రాబాద్-తిరునెల్వేలి-విజయవాడ.

SI 6075

